





# కావ్యాలు

## ప్రభంధములు

# గీత గోవిందం - అష్టపదులు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010001933

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan, CMU-Books, Sanskrit, TTD Tirupathi, Kerala Sahitya Akademi | INSA | Times of India, Indian Express, The Hindu, Deccan Herald, Eenadu, Vaartha | Tamil Heritage Foundation, AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు

# శ్రీ జయదేవకవి రచించిన
# గీతగోవింద మహాకావ్యము
# అష్టపదులు

కూర్పు : చీమకుర్తి చంద్రయ్య శెట్టి

పండిత పరిశోధనము, తాత్పర్య విలేఖనము :
విద్వాన్ నడాదూరి విజయరాఘవాచార్యులు

ప్రకాశకులు :

**ఎస్. వి. గోపాల్ అండ్ కో.**
**నెం. 18, గోపాలపురం, 8-వ వీధి,**
**మదరాసు-600 086.**

స్థాపితము: 1915 ☎ 479 345

 [వెల : రూ. 15-00

# తొలిపలుకు

సోదర సోదరీమణులారా!

భగవంతుడు ద్వాపరయుగములో శ్రీకృష్ణావతారమెత్తెను. బృందావనమున విహరించి ప్రజలకు. రాధామాధవుడుగా అతి శృంగారముగా దర్శనమిచ్చెను.

పెద్దల అనుగ్రహమువలన ఈ స్వరూపమును గురించి విన్న శ్రీ జయదేవులవారు ఈ రాధామాధవుల శృంగార రూపమును అతి విమర్శగా శృంగార రూపముతో 'గీత గోవిందం' అను కావ్యమును రచించి ప్రజలకు అర్పించిరి.

ఈ కావ్యములో ఒక్కొక్క గీతములోను యెనిమిది చరణములు కల్గియున్నవి గనుక ఈ కావ్యము 'అష్టపదులు' అను మారుపేరుతో పిలువబడుచున్నది. ఈ గీత గోవిందమును అనేక కవులు తాత్పర్య సహితముగా కూడ వ్రాసియున్నారు.

ఇప్పుడు మీకు అందిస్తున్న ఈ పుస్తకములో కొన్ని కఠిన మైన సంస్కృత పదములను విడదీసి, విడివిడిగా, అర్థములోనో, పదములోనో మార్పు రాకుండా, చిన్న, పెద్ద అందరు, సులభముగా పాడుకొనులాగున వ్రాసితిని.

కావున ఈ శృంగార రసవంతమైన పాటలను శ్రీకృష్ణ పరమాత్మని, రాధా సమేతముగా మనసులో తలచుకొని భక్తి పూర్వముగా నిండైన శ్రీకృష్ణ భక్తితో భజనలలో పాడుకొనిగానీ, అందరికీ వినిపించిగానీ, శ్రీకృష్ణపరమాత్మని కృపకు పాత్రులగుదురని ఆశిస్తున్నాను.

శ్రీ జయదేవ స్వాములవారు కూడ, అన్నమయ్య, త్యాగ రాజు వంటి మహా భక్తాగ్రేశరుల వరుసలో ఉన్నారనునది మనకు విదితము. జయదేవులవారు తాము వ్రాసిన ఈ కావ్యమును తాము తరించి, యితరులను తరింపచేసినారనుట సుస్పష్టము. ఓ భక్తా గ్రేసరులారా! ఈ 'అష్టపదులు' - అను గీతగోవింద మహా కావ్య మును పఠించి, మధుర గానామృతమును గ్రోలి, సకల ఆయు రారోగ్య ఐశ్వర్యాభివృద్ధు లొందెదరని ఆ ద్వాపరయుగ నాథుని మనసారా ప్రార్థించుచున్నాను.

—చీమకుర్తి చంద్రయ్యశెట్టి.



చీమకుర్తి చంద్రయ్యశెట్టి
నెం. 5, తంగవేలు వీధి, గోకులం కాలని,
టి. నగర్, మద్రాసు - 600 017.

# శ్రీ జయదేవులవారి జీవిత సంగ్రహము

శ్రీ జయదేవస్వాములవారు పదియవ శతాబ్దమున ఉత్కళ రాష్ట్రములో 'ధుంధు బిల్వము' అను గ్రామమున జనించిరి. ఒరిస్సా రాష్ట్రములో ఈ గ్రామమును 'కెందులి' అనియూ 'కింధు బిల్వము' అనికూడా పిల్చుదురు.

వీరి తల్లి తండ్రులు బ్రాహ్మణ కులములోని వారు. చాల భక్తి పరులు. వీరికి సంతానము చాల కాలమువరకు కలుగకుండుట వలన, వీరి ఇష్ట దైవమయిన శ్రీ జగన్నాథస్వామిని అమిత భక్తితో, తమకొక దైవభక్తుడుగాను, సద్గుణరూపుడుగాను, తమ వంశమునకు మంచి పేరు సంపాదించే వంశోద్ధారకుడుగాను ఉండు నట్లు తమకొక పుత్రుని కలుగునట్లు అనేక వ్రతములు, నోములు, పూజలు జేసెడివారు.

శ్రీ జయదేవులవారి తండ్రి పేరు భోజదేవుడు, తల్లి పేరు రమాదేవి. వీరిరువురిలో తల్లి రమాదేవి శ్రీ జగన్నాథస్వాముల వారిని అమిత సద్భక్తితో వేడగా వేడగా భగవంతునికి అనుగ్రహము కలిగి, శ్రీ మహావిష్ణువు తమ కరుణతో వ్యాసమహామునిని పిలిచి తమ భక్తురాలయిన రమాదేవికి పుత్రుడుగా జనించవలసినదని కోరిరి.

శ్రీ జగన్నాథస్వాములవారు, భోజదేవుల వారి కలలో రమాదేవివారి భక్తికిమెచ్చి ఆమెకు సత్పుత్రుడుగాను, భక్తిపరుడు గాను, కవిగాను, ఒక పుత్రుడు జననమగులాగున వరమిచ్చితినని చెప్పి అంతర్థానమొందెను. అదేమాదిరి రమాదేవికి కొద్దికాలములో

ఒక పుత్రుడు గలిగెను. పుట్టిన పుత్రుడు వ్యాసమహర్షి గదా! చిన్న తనములోనుండే భగవంతునిపై చాల భక్తిగల్గినవాడుగా ఉండెను. తల్లితండ్రులు వారి పుత్రునికి 'జయదేవ్' అని పేరు పెట్టి చాల ప్రేమతో పెంచుచుండిరి.

జయదేవుడు కాలము గడువ గడువ వేదములు నాల్గింటిని, వేదాంగముల నాఱింటిని, అనేక శాస్త్రములు, పౌరాణికములను, ఇతిహాసములను నేర్పుతో చదివి, విని, గొప్ప పండితుడుగా తయారయ్యెను. చిన్న వయస్సులో నుండే భక్తిగలిగిన వాడు కావున, భగవద్భక్తిని మరింత పెంచుకొనగలిగి, మహాభక్తుడుగా మారెను. భగవంతునిపై అనేక పాటలు వ్రాసి, పాడి, అందరికీ వినిపించుచూ భక్తిని ప్రజలలో పెంపొందించెను. తరువాత కొన్నాళ్ళకెల్లా వీరి ఇష్టదైవమైన శ్రీ జగన్నాధస్వాములవారిపై కీర్తనలు రచించెను. వీరే 'గీత గోవిందము' అనే కావ్యమును చాల రసవంతముగా వ్రాసిరి,

వీరి కవిత్వమును, పాండిత్యమును, సాహిత్య వరుసలను మెచ్చి వంగదేశపురాజు వీరిని తమ ఆస్థానకవిగా చేసుకొనెను. జయదేవులవారు గీతగోవిందములో ఇరువది నాల్గు పాటలను వివిధ రాగ, తాళములలో అమర్చిరి. ఇవన్నిటిని కూడ నిశ్చలమైన శ్రీ కృష్ణ భక్తితో (మరియే విమర్శనలు చేయక) భగవంతునికి మీ భక్తిని అర్పించుచూ, పాడుకొన్నచో, శ్రీ కృష్ణపరమాత్మని ఆశీస్సులు తప్పక కల్గును.

ఈ గీతగోవిందము (అనగా అష్టపదులు) చాల ప్రపంచ ప్రఖ్యాతి నొందినవి. గీతగోవిందములను మరొక రాజు వేరొకరీతిగా వ్రాసిననూ, అవి ప్రజా ప్రఖ్యాతి నొందలేదు. కావున జయదేవుల

వారి (గీతగోవిందము) అష్టపదులే ప్రజలలో ఖ్యాతినొందినది వీటిని అనేక విధములైన భజనలలో, అష్టపదులలో కొన్నింటినీ లేక అన్నింటినీ 'అష్టపదుల భజన' అను పేరుతో ఇరువదినాలుగ అష్టపదులను పాడుకొనుచున్నారు.

శ్రీ జయదేవులవారు, పద్మావతిదేవి అను ఒక ఆమెను వివాహమాడిరి. వీరుకూడ మహా పతివ్రతయు, భక్తిపరురాలుగా నుండి, జయదేవులవారికి సంసార జీవితముతోపాటు ఆయనకు ఆయన రచనలకు పరిపరి విధములుగా చాల సహాయకారిగా వుండిరి. శ్రీ జయదేవులవారు తత్వచింతామణి, కాకరవాదము, రతిమంజరి, చంద్రాలోకమనెడి కొన్ని యితర గ్రంథములనుకూడ రచించిరి.

శ్రీ జయదేవులవారు ఆత్మజ్ఞాని, వ్యాసమహర్షి వారి అవతార జననముగాన వారు మహా ప్రజ్ఞావంతులుగాను, పండితులుగాను, కవిగాను, పరమభక్తుడుగాను, ఈ ప్రపంచమున జనించి ఈ గీత గోవిందమను అష్టపదులను ప్రజానీకమునకు అందించిరి. కావున వీటిని సద్భక్తితో పఠించి, పాడుకొనుచూ, శ్రీ కృష్ణ భక్తులుగా మారి ముక్తిని కోరుకొందురని, అభిప్రాయపడుచూ, పాఠకులైన మిమ్ము వేడుకొనుచున్నాను.

ఇట్లు తమ విధేయుడు,
చీమకుర్తి చంద్రయ్యశెట్టి.

# అష్టపది ధ్యాన శ్లోకమ్

1. యద్గోపీవదనేందు మండన మభూత్
కస్తూరికా పత్రకం
యల్లక్ష్మీ కుచశాతకుంభ కలశే
వ్యాకోచ మిందీవరమ్।
యన్నిర్వాణవిధానసాధన విధౌ
సిద్ధాంజనం యోగినాం
తన్నః శ్యామళ మావిరస్తు హృదయే
కృష్ణాభిధానం మహః॥

2. రాధా మనోరమ రమావర రాసలీల
గానామృతైక భణితిం కవిరాజరాజమ్।
శ్రీమాధవార్చన విధౌ అనురాగసద్మ
పద్మావతీ ప్రియతమం ప్రణతోస్మి నిత్యమ్॥

3. శ్రీగోపాలవిలాసినీ వలయ సద్రత్నాధిముక్తాకృతి
శ్రీరాధాపతి పాదపద్మభజన ఆనందాబ్ధి మగ్నోనిశమ్।
లోకే సత్కవిరాజరాజ ఇతియః ఖ్యాతోదయాంభోనిధిః
తంవందే జయదేవసద్గురు మహం పద్మావతీవల్లభమ్॥

# శ్రీ జయదేవకవి రచించిన
# శ్రీ గీతగోవింద మహాకావ్యము

ప్రాదస్ దిష్టతలేతలే విటపినాం గ్రామేషుభిక్షామటః
స్వచ్ఛందం పిబయామునం జలమలం చీరాణికంథాంకురు।
సమ్మానం కలయాతి ఘోరగరళం నీచాభిమానంసుధాం
శ్రీరాధామురళీధరౌ భజసఖే బృందావనం మాత్యజ॥

సాక్షాత్తు వేదవ్యాసులమునివారి అవతారమైన శ్రీజయదేవ స్వాములవారు మనకు లభింపచేసిన ఈ 'గీతగోవిందం' అను ఇరువది నాలుగు అష్టపదులు కలిగిన శృంగార కావ్యము మొట్ట మొదట క్రీ. పూ. పదునారవ శతాబ్దమున మన దక్షిణదేశమునకు విజయముచేసిన శ్రీచైతన్య మహాప్రభువులవారిచే గొనితేబడినది, మన పెద్దలు ఆ కీర్తనములలోని భావముల ననుసరించి వాటికి మన కర్ణాటక రాగములను, తాళములను, సమకూర్చి యిచ్చినారు. వాటిని మన సాంప్రదాయ భజనలలో చాల కాలముగా పాడుకొను చున్నాము.

శ్రీకృష్ణుని పరమాత్మగాను, శ్రీరాధను జీవాత్మగాను, సఖిని గురువుగాను భావించాలి. నవరసములలో మేలైన శృంగార రసమయంగా ఈ కృతి రూపొందినది. నాయికానాయక భావమేకాక జ్ఞానులకు పరమాత్మునిపై కలిగే అలౌకిక ప్రేమకు సమమైనది. పాడువారు, తమ్ము రాధగా భావించుకొని, కృష్ణపరమాత్మపై దృష్టినుంచి భక్తి భావముతో పాడుకొన్నచో గాయత్రీ మహా మంత్రము వలె స్మరణమాత్రమున మనకు దైవకృప కలుగును.

ఈ కావ్యము శ్రీ కైలాసపతి యొక్క పరిపూర్ణ కటాక్షము పొందినది.

# శ్రీ జయదేవస్వాములవారిపై కీర్తనలు

రాగం : పూర్వీకల్యాణి  తాళం : త్రిపుట

ప. పద్మావతీ రమణమ్
జయదేవ కవిరాజభోజ దేవసుత పద్మపాదస్మరణమ్ ॥ప॥

అ.ప. యద్ గోపి వదనేందు మండల రమితమ్
తత్ గోవింద పద చంద్ర చకోరమ్ ॥ప॥

చ. 1. కిందు బిల్వ సదనం అతి అతి
దివ్య మంగళ వదనమ్
సుందరాంగ శుభ శోభద మదనమ్
సుముఖి రమాదేవి ప్రియకర సుధనమ్ ॥ప॥

మధ్యమకాలం

చ. 2. సహపండిత సముఖమ్
శత మన్మథ జిత మహనీయమ్
సతత కృష్ణప్రేమరసమగ్న
సమానరహిత గీతగోవిందకావ్య ॥ప॥

# గీతగోవిందం (అష్టపదులు)

## అష్టపది - 1 -

రాగం : మాళవం తాళం :

శ్లోకమ్

మేఘైర్ మేదురమంబరం వనభువ
శ్యామ స్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవతదిమమ్
రాధే గృహంప్రాపయ
ఇత్థం నందనిదేశతశ్చలితయోః ప్రత్యధ్వ
కుంజ ద్రుమమ్
రాధామాధవయోర్ జయంతి యమునాకూలే
రహః కేళయః॥

వాగ్దేవతాచరిత చిత్రిత చిత్తసద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ।
శ్రీ వాసుదేవ రతికేళి కథాసమేతమ్
ఏతంకరోతి జయదేవకవిః ప్రబన్ధమ్॥

యది హరిస్మరణే సరసం మనః
యది విలాస కళాసు కుతూహలమ్।
మధురకోమల కాన్త పదావళిమ్
శ్రుణు తథా జయదేవ సరస్వతీమ్॥

వాచః పల్లవయత్యు మాపతిధరః సందర్భ శుద్ధింగిరామ్
జానీతే జయదేవ ఏవశరణః శ్లాఘ్యోదురూ హద్రుతేః।
శృంగారోత్తర సత్ప్రమేయరచనైః ఆచార్య గోవర్ధనః
స్పర్ధీ కోపినవిశ్రుతః శ్రుతిధరో దోయీచ పీక్ష్మపతిః॥

చ. 1. ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదమ్
విహిత వహిత్ర చరిత్రం అఖేదమ్
కేశవ! ధృత మీనశరీర! ॥జయజగదీశహరే॥

చ. 2. క్షితి రతి విపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణ కిణ చక్రగరిష్ఠే
కేశవ! ధృత కచ్ఛపరూప! ॥జయజగదీశహరే॥

చ. 3. వసతి దశన శిఖరే ధరణీ తవ లగ్నా
శశిని కళంక కశేవ నిమగ్నా
కేశవ! ధృత సూకరరూప! ॥జయజగదీశహరే॥

చ. 4. తవ కరకమలవరే నఖ మద్భుత శృంగమ్
దళిత హిరణ్యకశిపు తను భృంగమ్
కేశవ! ధృత నరహరిరూప! ॥జయజగదీశహరే॥

చ. 5. చలయసి విక్రమణే బలి మద్భుత వామన
పదనఖనీర జనితజన పావన
కేశవ! ధృత వామనరూప! ॥జయజగదీశహరే॥

చ. 6. క్షత్రియ రుధిరమయే జగదపగత పాపమ్
స్నపయసిపయసి శమిత భవతాపమ్
కేశవ! ధృత భృగుపతిరూప! ॥జయజగదీశహరే॥

చ. 7. వితరసి దిక్షు రణే దిక్పతి కమనీయమ్
దశముఖ మౌళిబలిం రమణీయమ్
కేశవ! ధృత రఘుపతిరూప! ॥జయజగదీశహరే॥

చ. 8. వహసి వపుషి విశదే వసనం జలదాభమ్
హలహతి భీతి మిళిత యమునాభమ్
కేశవ! ధృత హలధరరూప! ॥జయజగదీశహరే॥

చ. 9. నిందసి యజ్ఞ విధే అహహ శృతిజాతమ్
సదయ హృదయ దర్శిత పశుఘాతమ్
కేశవ! ధృత బుద్ధ శరీర! ॥జయజగదీశహరే॥

చ. 10. మ్లేచ్ఛనివహ నిధనే కలయసి కరవాలమ్
ధూమకేతు మివ కిమపి కరాళమ్
కేశవ! ధృత కల్కి శరీర ॥జయజగదీశహరే॥

చ. 11. శ్రీజయదేవ కవేః ఇదముదితముదారమ్
శృణు శుభదం సుఖదం భవసారమ్
కేశవ! ధృత దశవిధరూప! ॥జయజగదీశహరే॥

# గీతగోవిందం-భావప్రకాశిక

## కథాప్రారంభము

నందగోపుడు ఆవులమందలను మేపడానికి అడవికి తోలుకుని పోయేటప్పుడు రాధ కృష్ణుడూ వెంటబడ్డారు. ఉన్నట్లుండి ఆకాశం మేఘావృతమై జడివాన కురిసే లక్షణాలు కనబడతాయి. అప్పుడు నందగోపుడు రాధను చూచి "అమ్మాయీ! శ్రీకృష్ణుడు పసివాడు. ఉరుములకు మెరుములకు జడుసుకుంటాడేమో, భద్రంగా ఇంటికి పిలుచుకునిపో" అని రాధకు కృష్ణుణ్ని అప్పగిస్తాడు. రాధా కృష్ణులు ఇంటికి పోకుండా యమునా నదీతీరంలో ఉన్న ఒక మనోహర స్థలాన్ని చేరుకుని క్రీడలో పాల్గొంటారు.

రాధాకృష్ణుల ప్రేమ తత్వం జీవ పరమాత్మల అవినాభావ సంబంధానికి ప్రతీక. 'భక్తిః శృంగార వృత్యా పరిణమతి. (భక్తియే శృంగార రూపంగా పరిణమిస్తుంది) అన్నట్లు భగవంతునెడ జీవునకు గల అచంచల భక్తి భగవంతుని ఎడబాటువల్ల విరహంగా పరిణమిస్తుంది. నాయన్మార్లు ఆళ్వార్లు మున్నగు పరమ భక్తులు కూడా 'స్త్రీ ప్రాయమితరం జగత్' అన్నట్లు సకల జీవరాసులకు ప్రాణాధారమైన పరబ్రహ్మాన్ని పురుషుడుగా తమ్ము స్త్రీగా భావించుకుని భక్తిని వ్యంగంగాగల విరహగీతాల, ప్రణయ గీతాలకు సదృశమైన రచనలు గావించారు. ఆ మార్గాన్ని అనుసరించి జయదేవకవి ఆ రాధాకృష్ణుల ప్రణయ వృత్తాంతాన్ని ఈ అష్టపదులలో కావ్య మర్యాద ననుసరించిన వర్ణనలతో కూర్చాడు.

## మొదటి అష్టపది (భావప్రకాశిక)

[ఇందు శ్రీకృష్ణుని దశావతారాలు ప్రశంసింపబడినవి.]

1. ప్రళయకాలంలో సముద్రాలు వుప్పొంగి భూమండలాన్ని ముంచివేసినపుడు, ఓడవలె ఆ సముద్రజలాల్లో ఒక పెద్ద చేపవై వేదాలను ధరించి విచిత్ర లీల జరిపావు. శ్రీకృష్ణా! నీకు జయమగుగాక.

2. తాబేలు రూపాన్ని ధరించిన స్వామీ! మందర పర్వతాన్ని విశాలమైన వీపులో ధరించినపుడు దాని రాపిడివల్ల గాయాలు గాచిన నీ వీపున భూమి ఉన్నది కదా! మహా కచ్ఛప రూపంతో భగవానుడు భూమిని ధరించి ఉన్నాడన్నది పురాణ ప్రసిద్ధం.

3. స్వామీ! వరాహావతారమందు తెల్లగా చంద్రరేఖవలె ప్రకాశించే కోరలతో నీవు భూమండలాన్ని ఎత్తిపట్టినప్పుడు అది చంద్రునిలో కళంకంలా కానవచ్చింది కదా!

4. స్వామీ! నృసింహావతారంలో తామరలలాంటి నీ చేతుల లోని వేళ్ళ గోళ్ళ కొనలో నీచే చీల్చబడిన హిరణ్యకశిపుని శరీరం తామరల మీద వాలిన తుమ్మెదలా ఉండినది.

5. వామనావతారంలో బలిని యాచించి త్రివిక్రముడవై అతణ్ణి స్థానభ్రష్టుణ్ని చేశావు. ఆ సమయంలో నీ పాదాల వేళ్ళ గోళ్ళ కొనలోనుండి జారిన నీటి ధారచే మూడు లోకాల్లో వసించే వారిని పవిత్రుల్ని చేశావు. త్రివిక్రమావతారంలో ఆకాశాన్ని ఆక్రమించిన విష్ణు పాదాన్ని బ్రహ్మ భక్తితో కడగగా ఆ నీళ్ళు పవిత్ర గంగానదిగా ప్రవహించిందన్న విషయం పురాణ ప్రసిద్ధం.

6. పరశురాముడవై గర్వించిన రాజులనెల్ల మట్టుపెట్టి అందువల్ల కలిగిన రక్తపు మడుగులవల్ల ప్రజల పాపాలు, భవ బంధాలు పోయేటట్లు చేశావు. పరశురాముడు రాజులను చంపగా వాళ్ళ రక్తం ఐగుమడుగులైందనీ ఆ మడుగులే శమంత పంచక మనబడే గొప్ప తీర్థ స్థానాలైనవని పురాణ వృత్తాంతం.

7. శ్రీరాముడవై రఘువంశంలో అవతరించి దశదిశల్లో రణవిక్రమాన్ని ప్రకటించి ఇంద్రాది దేవత ప్రార్థననుసరించి రావణుని పది తలలు బలిగొన్నావు. రావణుని తలలు దేవుడి పాదాల వద్ద బలి యివ్వబడినట్లు రాలిపడినవి.

8. బలరాముడవై తెల్లగా ప్రకాశిస్తున్న శరీరంమీద నీల మేఘంలా మెరుస్తున్న నీలపు పట్టు వస్త్రాన్ని, నీహలాయుధంవల్ల కలతపొందింపబడి భయపడుతున్న యమునానది జలాలవంటి కాంతి కలదాన్ని కప్పుకున్నావుగదా. ఒకప్పుడు కౌరవులమీద కోపపడి, బలరాముడు హస్తినాపురాన్ని పెళ్ళగించడానికి తన హలాయుధంతో లాగాడనీ, యమునగట్టు ఓరగిల్లిందని అంతలో మునుల పెద్దల ప్రార్థనతో శాంతించి వదలాడని పురాణకథ.

9. బుద్ధుడవై అవతరించి భూతదయ ముఖ్య ధర్మమని యజ్ఞాలలో పశువధ కావించే వేదకర్మలను నిరసించావు.

10. కల్కి అవతారంతో మ్లేచ్ఛ జనవినాశానికి ధూమకేతు వలె భయంకరంగా మండుతున్న ఖడ్గాన్ని చేతిలో ధరించి దుష్ట నిగ్రహం శిష్టజన రక్షణ చేస్తావు.

11. ఈ లోకంలో సారతమమైన లీలతో ఇలా దశావ తారాలతో లోకాన్ని రక్షించి మించిన కృష్ణా! భక్తిని వ్యంగ్యంగా కలిగి ఉన్న శృంగార సమయగీతాలను, గంభీరము, శుభకరము ఐన వాటిని వినుమా.

## అష్టపది - 2

### శ్లోకమ్

వేదా నుద్ధరతే జగన్నివహతే భూగోళముద్బిభ్రతే
దైత్యం దారయతే బలిం చలయతే క్షత్రక్షయంకుర్వతే।
పౌలస్త్యం జయతేహలం కలయతే కారుణ్యమాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతి కృతే॥
కృష్ణాయతుభ్యన్నమః

రాగం : భైరవి తాళం : త్రిపుట

చ. 1. శ్రిత కమలాకుచమండల ధృతకుండల
కలిత లలిత వనమాలి॥
హరిగోవింద హరిగోపాల ॥జయజయదేవహరే॥

చ. 2. దినమణి మండల మండన భవ ఖండన
మునిజన మానసహంస ॥జయజయదేవహరే॥

చ. 3. కాళియ విషధర భంజన జనరంజన
యదుకుల నళిన దినేశ ॥జయజయదేవహరే॥

చ. 4. మధు ముర నరక వినాశన గరుడాసన
సురకుల కేళి నిదాన ॥జయజయిదేవహరే॥

చ. 5. అమల కమల దళలోచన భవమోచన
త్రిభువన భువన నిధాన ॥జయజయదేవహరే॥

చ. 6. జనకసుతా కుచభూషణ జితదూషణ
సమర శమిత దశకంఠ ॥జయజయదేవహరే॥

చ. 7. అభినవ జలధర సుందర ధృతమందర
శ్రీముఖ చంద్ర చకోర ॥జయజయదేవహరే॥

చ. 8. శ్రీజయదేవ కవే రిదం కురుతే ముదము
జ్జ్వల మంగళ గీతమ్ ॥జయజయదేవహరే॥

## రెండవ అష్టపది (భావప్రకాశిక)

[ఈ రెండవ అష్టపదిలో శ్రీకృష్ణలీలలు అభి వర్ణింప బడినవి.]

1. లక్ష్మీదేవిచే ఆశ్రయింపబడిన హృదయం కలవాడా! ధగధగ మెరుస్తున్న కుండలాలు ధరించిన వాడా! మనోహరమైన వనమాలను ధరించిన దేవా! హరీ! గోవిందా! గోపాలా! నీకు ఎల్లప్పుడు జయమగు గాక!

2. సూర్యునివలె ప్రకాశిస్తున్న రత్నాలంకారాలతో అలంక రించబడినవాడా! భవబంధాన్ని పోగొట్టేవాడా! మునుల హృదయా లనే మానస సరస్సులో సంచరించే హంస అగువాడా జయము!

3. విషనాగుల్లో పేరుపొందిన కాళియుని అణచిన వాడవు. జనులకు మిక్కిలి సంతోషం కలిగించేవాడవు. యదుకులం అనే తామరకు వికాసం కలిగించే సూర్యుడవు, నీకు జయము.

4. మధు, ముర, నరకాది రాక్షసుల్ని నాశం చేశావు. గరు డుణ్ని వాహనంగా జేసుకున్నావు. దేవతల క్రీడలకు ఆదికారణ మైనావు. దేవతలు గోపీ, గోపకులుగా జన్మించి శ్రీకృష్ణునితో క్రీడిస్తూ గొప్ప సంతోషం పొందడం ఇందులో సూచింపబడింది.

5. నిర్మలమైన తామర రేకులవంటి నేత్రాలు కలవాడివి. ఆశ్రితులను జనన మరణ రూపమైన సంసారబంధంనుంచి విడిపించ గలవాడివి. మూడు లోకాల ఉత్పత్తికి కారణం నీవే, అలాంటి దేవ దేవుడవైన నీకు జయం.

6. సీతాదేవి కుచాలకు ఆభరణంలా, ఆ దేవి హృదయంలో ఎల్లప్పుడు విహరిస్తున్నావు. ఖరదూషణ రాక్షసుల్ని జయించావు. ఖరదూషణాదుల్ని సంహరించి విక్రమంచూపి అలసిన శ్రీరాముణ్ణి సీతాదేవి ఆలింగనంతో సంభావించి శ్రమదీర్చిన వృత్తాంతం శ్రీ రామాయణ ప్రసిద్ధం. త్రిలోక భయంకరుడైన రావణాసురుణ్ని యుద్ధంలో సంహరించావు. అలాంటి దేవుడవు, నీకు జయం.

7. క్రొక్కారు మేఘంలా సౌందర్యం కలవాడివి. క్షీరసాగ రాన్ని దేవతలు రాక్షసులు కలిసి చిలికినపుడు మందర పర్వతాన్ని వీపున ధరించావు. ఆ మథన సందర్భంలో పాలకడలిలో తోచిన లక్ష్మీదేవి ముఖమనే చంద్రమండలానికి చంద్రకిరణాలను పానంచేసి జీవించే చకోర పక్షిలా ఆమె ముఖసౌందర్య వీక్షణంవల్ల అమి తానందం పొందినవాడవై ప్రకాశిస్తున్నావు. అలాంటి దేవుడవైన శ్రీహరివి నీకు జయం.

8. మిక్కిలి ప్రకాశిస్తూ శ్రోతలకు సంతోషాన్ని కలిగిస్తూ మంగళకరమై శ్రీజయదేవుని ఈ మంగళగీతం ఒప్పుతున్నది. దేవా నీకు జయం గలుగునుగాక.

## అష్టపది - 3

### శ్లోకమ్

వసంతే వాసంతీ కుసుమ సుకుమారైః అవయవైః
భ్రమన్తీం కాన్తారే బహువిహిత కృష్ణానుసరణామ్ ।
అమందం కందర్ప జ్వర జనిత చింతాకులతయా
వలద్బాధాం రాధాం సరస మిదమూచే సహచరీ ॥

రాగం : వసంతా - హుసేని　　　　తాళం : ఆది

చ. 1. లలితలవంగ లతా పరిశీలన
కోమల మలయ సమీరే
మధుకర నికర కరంబిత కోకిల
కూజిత కుంజకుటీరే

ప. విహరతి హరి రిహ సరసవసన్తే
నృత్యతి యువతిజనేనసమం సఖి
విరహిజనస్య దురంతే (రాధే)　　॥విహరతి॥

చ. 2. ఉన్మద మదనమనోరథ పథిక
వధూజనజనిత విలాపే
అళికుల సంకుల కుసుమసమూహ
నిరాకులవకుళకలాపే　　॥విహరతి॥

చ. 3. మృగమదసౌరభ రభసవశంవద
నవ దళమాల తమాలే
యువజన హృదయ విదారణ మనసిజ
నఖరుచి కింశుకజాలే　　॥విహరతి॥

చ. 4. మదన మహీపతి కనకదణ్డరుచి
కేసర కుసుమ వికాసే
మిళిత శిలీముఖ పాటలపటల
కృత స్మరతూణ విలాసే ॥విహరతి॥

చ. 5. విగళిత లజ్జిత జగదవలోకన
తరుణ కరుణ కృతహాసే
విరహి నికృంతనకుంత ముఖాకృతి
కేతుక దంతురితాశే ॥విహరతి॥

చ. 6. మాధవికా పరిమళ మిలితే నవ
మాలికయాతిసుగంధౌ
మునిమనసా మపి మోహనకారిణి
తరుణా కారణ బంధౌ ॥విహరతి॥

చ. 7. స్ఫురదతిముక్త లతాపరిరంభణ
ముకుళిత పులకిత చూతే
బృందావనవిపినే పరిసర పరి
గత యమునాజల పూతే ॥విహరతి॥

చ. 8. శ్రీజయదేవభణిత మిద ముదయతి
హరి చరణ స్మృతిసారమ్
సరస వసంత సమయ వనవర్ణనమ్
అనుగత మదన వికారమ్ ॥విహరతి॥

---

శ్లో॥ దరవిదళిత మల్లీ వల్లీ చంచత్పరాగ
ప్రకటిత పటవాసై ర్వాసయన్ కాననాని।
ఇహహి దహతిచేతః కేతకీ గంధబంధుః
ప్రసరద సమబాణ ప్రాణవద్గంధవాహః ॥

ఉన్మీలన్మధు గంధలుబ్ధ మధుపవ్యాధూత చూతాంకుర
క్రీడత్కోకిల కాకలీకలకలై రుద్గీర్ణ కర్ణజ్వరాః।
నీయంతే పథికైః కథం కథమపిధ్యానావధానక్షణ
ప్రాప్త ప్రాణసమాసమాగమరసోల్లాసైరమీ వాసరాః॥

## మూడవ అష్టపది (భావప్రకాశిక)

[శృంగారభావాల్ని ఉద్దీపింపజేసే వసంతం ఈ గీతంలో వర్ణింపబడింది. రాధ వసంతోదయంవల్ల తన మనస్సులో శ్రీకృష్ణునందలి అనురాగం ఉద్దీప్తం కాగా విరహంతో బాధపడుతున్నది. ఆ సమయంలో చెలి రాధ వద్దకు వచ్చి ఇదే వనంలో శ్రీకృష్ణుడు వేరే యువతులతో ఆనందంతో క్రీడిస్తున్నాడు వెళ్ళి చూడు అంటుంది.]

1. విరహం పొందినవారికి అంతులేని సంతాపం కలిగించే సరసవసంతంలో శ్రీకృష్ణుడు యువతులతో నృత్యం చేస్తున్నాడు. ఆనందంతో క్రీడిస్తూ విహరిస్తున్నాడు.

2. తమ భర్తలు కార్యాంతరంవల్ల బాటవెంబడి విదేశాలకు పోగా వారి ప్రియుడాండ్రు మన్మథునివల్ల తమ మనసులలో పలు రకాలైన కోరికలు ఎక్కువకాగా తపించిపోతున్నారు. ఇలాంటి వసంతంలో తుమ్మెదగుంపులు పువ్వుల చుట్టూ మూగి అలజడి కలిగిస్తున్న పొగడ వృక్షాలు నిండియున్న వనంలో కృష్ణుడు విహరిస్తున్నాడు.

3. కస్తూరి పరిమళానికి వశపడిన చిగురాకులుగల కానుగ చెట్లతో, యువజనుల హృదయాలను చీల్చే మన్మథుని గోళ్ళ

కాంతివలె ప్రకాశిస్తున్న మోదుగ పువ్వులతో కూడిన వసంతంతో అడవిలో కృష్ణుడు విహరిస్తున్నాడు.

4. మన్మథుడనే రాజుకు పట్టిన బంగారు కామలతోగూడిన గొడుగుల్లా నాగకేసరపుష్పాలు ప్రకాశిస్తుండగా, తుమ్మెదలనే బాణాలతో కూడిన మన్మథుని అమ్ములపొదివలె కలిగొట్టు పుష్పాలు వికసించి వుండగా సొంపు మీరిన వసంతకాలపు అరణ్యాలలో శ్రీకృష్ణుడు విహరిస్తున్నాడు.

5. సిగ్గువీడి మదనోన్మదంతో లోకాన్ని చూస్తున్న తరుణుల చిరునవ్వుల్లా కరుణపువ్వులు ఒప్పుచుండగా, విరహంతో బాధపడే వారి హృదయాలకు వాడి ఈటెల్లా ఉన్న మొగలి పువ్వులు పది దిక్కులా వెల్లివిరిసి ఉన్న ఈ వసంతంలో వనంలో శ్రీకృష్ణుడు విహరిస్తున్నాడు.

6. పుష్టించిన బండి గురువింద పువ్వుల వాసనలతో కూడి కొత్త మల్లెల పరిమళం అంతటా వ్యాపిస్తూ ఉండగా మునుల మనస్సులను కూడా మోహపెట్టి తరుణులకు అకారణబంధువుగా ఉన్న ఈ వసంతంలో అరణ్యంలో శ్రీకృష్ణుడు విహరిస్తున్నాడు.

7. బాగా పుష్పించిన బండి గురువింద తీగలు తమ్ము అల్లుకోవడంవల్ల పులకించినట్లుగా చిగురాకులతో కూడిన మామిడి చెట్లతో, సమీపంలో ప్రవహిస్తున్న యమునానదిలోని జలాలచేత పవిత్రమైయున్న బృందావనంలోని అరణ్యంలో శ్రీకృష్ణుడు యువతులతో విలాసక్రీడలు చేస్తున్నాడు.

8. మన్మథ వికారాన్ని కలిగించే వసంకాలంలో శ్రీహరి పాదాలను సంస్మరిస్తూ మనస్సులో తోచిన మధురభావాలతో కూడిన ఈ వన వర్ణనను జయదేవకవి రచించాడు.

చ. 4. కాపి కపోలతలే మిళితా
లపితుం కిమపి శ్రుతిమూలే
చారుచుచుమ్బ నితంబవతీ
దయితంపులకైై రనుకూలే ॥హరిరిహ॥

చ. 5. కేళికళాకుతు కేన చ కాచిద్
అముంయమునావనకూలే
మంజులవంజుల కుంజగతమ్
విచకర్ష కరేణ దుకూలే ॥హరిరిహ॥

చ. 6. కరతల తాళతరళ వలయావళి
కలిత కలస్వన వంశే
రాసరసే సహనృత్యపరా
హరిణా యువతిః ప్రశశంసే ॥హరిరిహ॥

చ. 7. శ్లిష్యతి కామపి చుంబతికామపి
రమయతి కామపి రామామ్
పశ్యతి సస్మిత చారుతరామ్
అపరాం అనుగచ్ఛతి వామామ్ ॥హరిరిహ॥

చ. 8. శ్రీజయదేవభణిత మిద మద్భుత
కేశవకేళి రహస్యమ్
బృందావన విపినే చరితమ్
వితనోతు శుభాని యశస్యమ్ ॥హరిరిహ॥

---

శ్లో॥ విశ్వేషామనురంజనేన జనయన్నానంద మిందీవర
శ్రేణీశ్యామల కోమలైరు పనయన్నంగైరనంగోత్సవమ్ ।
స్వచ్ఛందం వ్రజసుందరీభి రభితః ప్రత్యంగ మాలింగితః
శృంగారస్సఖిమూర్తి మానివమిథౌ ముగ్ధోహరిః క్రీడతి॥

## గీతగోవిందం (అష్టపదులు)

అద్యోత్సంగ వసద్భుజంగ కబళక్లేశాదివేశాచలమ్
ప్రాలేయ ప్లవనేచ్ఛయానుసరతి శ్రీఖండశైలానిలః।
కించిత్స్నిగ్ధరసాలమౌళి ముకుళాన్యాలోక్య హర్షోదయా
దున్మీలంతికుహూః కుహూరితి కలోత్తాలాః పికానాంగిరః॥
రాసోల్లాసభరేణ విభ్రమభృతామాభీరవామ భ్రువామ్
అభ్యర్ణం పరిరభ్య నిర్భరమురః ప్రేమాన్ధయారాధయా।
సాధుత్వద్వదనం సుధామయమితి వ్యాహృత్యగీత స్తుతి
వ్యాజాదుద్భట చుంబితస్స్మితమనోహరీ హరిః పాతువః॥

## నాలుగవ అష్టపది (భావప్రకాశిక)

[చెలి రాధతో శ్రీకృష్ణుడు గోపికలతో రాసక్రీడ గావిస్తూ విహరించిన విధాన్ని ఈ గీతంలో వర్ణించి చెబుతున్నది.]

1. కొత్తమేఘంవలె నీలవర్ణంతో సుందరమై ఉన్న శరీరం మీద పచ్చని బంగారు పట్టుబట్ట కప్పుకుని క్రీడలో చెవులలోని మకరకుండలాలు కదలాడడంవల్ల అందలి మణుల కాంతులతో మెరుస్తున్న చెక్కిళ్ళుగల శ్రీకృష్ణుడు ముగ్ధగోపికలతో విహరిస్తున్నాడు.

2. బలిసిన కుచమండలంతో ఒకగోపిక అనురాగపూరితయై శ్రీకృష్ణుణ్ణి బిగ్గరగా కౌగిలించుకుని అతడు మనోహరంగా గానం చేస్తున్న పంచమస్వరంలో తన గొంతుకలిపి కూడా పాడుతున్నది.

3. ఒక గోపముగ్ధ మన్మథవిలాస లీలలచేత చంచలములై మన్మథ వికారంతో కూడిన శ్రీకృష్ణుని ముఖకమలాన్ని ధ్యానిస్తున్నది.

4. ఒక గొల్లపడుచు శ్రీకృష్ణుని చెవిలో ఏదో రహస్యం చెప్పదలచి తన పెదవుల్ని అతని చెక్కిలిదగ్గరికి గొనిపోయి పులకలతో నిండి అందం గులుకుతూ ఉన్న చెక్కిలిని జూచి మోహించి ముద్దాడుతున్నది.

5. యమునా నదిగట్టున గల మనోహరమైన వకుళవృక్షపు పొదలో ఉన్న శ్రీకృష్ణునితో క్రీడింపవలెననే కుతూహలంతో ఒక గోపిక అతని పట్టు వస్త్రాన్ని బట్టి లాగుతున్నది.

6. శ్రీకృష్ణుడు రాసక్రీడగావిస్తూ పిల్లనగ్రోవి మ్రోయిస్తూ ఉండగా చేతిగాజులు ఘల్లుమన తాళంవేస్తూ నృత్యం చేస్తూ ఉన్న ఒక గోపయువతిని శ్రీకృష్ణుడు మెచ్చుకుంటున్నాడు.

7. శ్రీకృష్ణు డొక ముగ్ధగోపికను కౌగిలించుకొంటున్నాడు. మరొక్కతెను ముద్దాడుతున్నాడు. మరొక్కతెతో రమిస్తున్నాడు. వేరొక సుందరిని చూచి మనస్సును కొల్లగొడుతూ చిరునవ్వు నవ్వుతున్నాడు. వేరొకదాని వెంట బడిపోతున్నాడు.

8. బృందావనారణ్యంలో శ్రీకృష్ణుడు గోపికలతో గావించిన అద్భుతమూ ప్రశంసనీయమూ ఐన కేళీరహస్యాన్ని జయదేవకవి వర్ణించాడు. ఈ గీతం అందరికీ సకల శ్రేయస్సులను కలిగించగలదు.

## అష్టపది - 5

రాగం : తోడి తాళం : ఆది

### శ్లోకమ్

విహరతి వనే రాధా సాధారణప్రణయే హరౌ
విగళితనిజోత్కర్షా దీర్ష్యావశేన గతాన్యతః ।
క్వచి దపి లతాకుంజే గుంజన్మధు వ్రతమండలీ
ముఖరశిఖరే లీనా దీనాప్యువాచ రహః స్సఖీమ్ ॥

చ. 1. సంచరదధర సుధామధుర ధ్వని
ముఖరితమోహన వంశమ్
చలిత దృగంచల చంచలమౌళి
కపోల విలోల వతంసమ్

ప. రాసే హరి మిహ విహిత విలాసమ్
స్మరతి మనో మమ కృతపరిహాసమ్ ॥రా సే॥

చ. 2. చంద్రక చారు మయూర శిఖండక
మండలవలయిత కేశమ్
ప్రచుర పురందర ధను రనురంజిత
మేదుర ముదిరసువేషమ్ ॥రా సే॥

చ. 3. గోప కదంబ నితంబవతీముఖ
చుంబనలంబిత లోభమ్
బంధుజీవ మధురాధరపల్లవ
కలిత దరస్మిత శోభమ్ ॥రా సే॥

చ. 4. విపులపులక భుజపల్లవ వలయిత
వల్లవ యువతి సహస్రమ్
కరచరణోరసి మణిగణభూషణ
కిరణ విభిన్న తమిస్రమ్ ॥రా సే॥

చ. 5. జలదపటల చలదిందు వినిందక
చందన బిందు లలాటమ్
పీనపయోధర పరిసర మర్దన
నిర్దయ హృదయ కవాటమ్ ॥రా సే॥

చ. 6. మణిమయ మకర మనోహర కుండల
మండితగండ ముదారమ్
పీతవసన మనుగత మునిమనుజ
సురాసుర వర పరివారమ్ ॥రా నే॥

చ. 7. విశద కదంబతలే మిళితం కలి
కలుషభయం శమయంతమ్
మా మపి కిమపి తరంగదనంగ
దృశావపుషా రమయంతమ్ ॥రా నే॥

చ. 8. శ్రీజయదేవభణిత మతిసుందర
మోహన మధురిపు రూపమ్
హరిచరణ స్మరణం ప్రతిసంప్రతి
పుణ్యవతాం అనురూపమ్ ॥రా నే॥

## ఐదవ అష్టపది (భావప్రకాశిక)

[తానే చక్కనిదానవనీ, శ్రీకృష్ణునికి తనయందే ప్రేమయని గర్విస్తున్న రాధకు చెలి చెప్పిన శ్రీకృష్ణుని రాసక్రీడావిలాసాలు అసూయను రేకెత్తించింది. చాలదూరంలో ఉన్న ఒక పొదరింటిలో చేరి చెలితో "ఆ వంచకుడు నన్ను ఏమార్చినప్పటికీ నా మనస్సేమో అతనియందే లీనమై యున్నద"ని శ్రీకృష్ణుని వర్ణిస్తూ ఇలా చెలితో చెప్పుతున్నది.]

1. తన పెదవిమీద ఆనింపబడిన పిల్లనగ్రోవి తన అధరామృతముతో కలిసి మధురగానం వెలయిస్తూ శబ్దిస్తుండగా, కడగంటి చూపులు చలింప గానంచేసేటప్పుడు తన మౌళి చలింప

చెవులో చెక్కుకున్న పువ్వు చెక్కిలిమీద కదలియాడుచుండగా శ్రీకృష్ణుడు గోపికలతో విలాసక్రీడగావిస్తూ నన్ను పరిహసించి నప్పటికీ నన్ను వదలిపెట్టినప్పటికీ నామనస్సేమో అతనినే స్మరిస్తున్నది.

2. ఇంద్రధనుస్సుతోకూడి మనోహరమైయున్న నీల మేఘంలా తన శిఖలో పలురంగులతో మెరిసే నెమిలిపింఛాల్ని పెట్టుకునియున్న ఆ కృష్ణునే నా మనస్సు స్మరిస్తున్నది.

3. బలిసిన పిరుదులుగల గోపిక ముఖాన్ని ముద్దాడుటలో లోభం కలిగి మంకెన పువ్వులా మెరుస్తున్న మధురాధరమనే చిగురులో అందం గులుకుతున్న చిరునవ్వు వెలయిస్తూ ఉన్న ఆ శ్రీకృష్ణునే నా మనస్సు స్మరిస్తున్నది.

4. బాగా పులకరించిన చిగురాకువలెనున్న భుజాలతో గోప కాంతలను చుట్టుకుని తన పాదాలలో చేతుల్లో మెడతో మెరుస్తున్న భూషణాలలోని మణుల కాంతులవల్ల చీకట్లను చెదరగొడుతూ వున్న శ్రీకృష్ణునే నా మనస్సు స్మరిస్తున్నది.

5. మేఘమండలంలో చలిస్తున్న చంద్రుణ్ణి తిరస్కరిస్తూ తన నుదుట చందనం బొట్టు ప్రకాశిస్తుండగా, బలిసిన గోపకాంతల స్తన మండలాన్ని నిర్దయగా పీడిస్తున్న తలుపు చెక్కవలె విశాల మైన రొమ్ముగల శ్రీకృష్ణునే నా మనస్సు స్మరిస్తున్నది.

6. మణిమయాలైన మకరకుండలాలు కదలుతూ వుండగా వాటి కాంతులతో మెరుస్తున్న చెక్కిళ్ళు గలిగి, బంగారు పసుపు పచ్చ పట్టు వస్త్రాన్ని ధరించి మునులు, దేవతలు తన్ను చుట్టుకుని పరివారంగా కొలుస్తుండగా వెలసివున్న శ్రీకృష్ణునే నా మనస్సు స్మరిస్తున్నది.

7. విశాలమైన కదంబవృక్ష చ్ఛాయలో మెలగుతూవున్న కలిదోషాల్ని పోగొట్టేవాడై, నన్నుగూడ అనురాగాన్ని వెలయించే చూపులతో చూస్తూ మనస్సులోనే రమిస్తున్న శ్రీకృష్ణునే నా మనస్సు స్మరిస్తున్నది.

8. శ్రీ జయదేవుని మాటలతో వర్ణింపబడిన సుందర మోహన శ్రీకృష్ణుని రూపం, పుణ్యవంతులకు తగినట్లు శ్రీహరి చరణ స్మరణాన్ని కలిగిస్తున్నది.

## అష్టపది - 6

రాగం : కాంభోజి తాళం : త్రిపుట

### శ్లోకమ్

గణయతి గుణగ్రామం భ్రామం భ్రమాదపి నేహతే
వహతి చ పరితోషం దోషం విముంచతి దూరతః।
యువతిషు వలత్తృష్ణే కృష్ణే విహారిణి మాం వినా
పున రపి మనో వామం కామం కరోతి కరోమి కిమ్॥

చ. 1. నిభృతనికుంజ గృహం గతయా నిశి
రహసి నిలీయ వసంతమ్
చకిత విలోకిత సకలదిశా రతి
రభస భరేణ హసంతమ్

ప. సఖి! హే కేశిమథన ముదారమ్
రమయ మయా సహమదన మనోరథ
భావితయా సవికారమ్ ॥సఖిహే॥

చ. 2. ప్రథమ సమాగమ లజ్జితయా పటు
చాటుశతై రనుకూలమ్
మృదు మధురస్మిత భాషితయా శిథి
లీకృత జఘనదుకూలమ్ ॥సఖిహే॥

చ. 3. కిసలయశయన నివేశితయా చిర
మురసి మమైవశయానమ్
కృత పరిరంభణ చుంబనయా పరి
రభ్య కృతాధర పానమ్ ॥సఖిహే॥

చ. 4. అలసనిమీలిత లోచనయా పుల
కావలి లలిత కపోలమ్
శ్రమజల సకల కళేబరయా వర
మదన మదాదతిలోలమ్ ॥సఖిహే॥

చ. 5. కోకిల కలరవ కూజితయా జిత
మనసిజ తంత్రవిచారమ్
శ్లథకుసుమాకుల కుంతలయా నఖ
లిఖిత ఘనస్తనభారమ్ ॥సఖిహే॥

చ. 6. చరణ రణిత మణినూపురయా పరి
పూరిత సురతవితానమ్
ముఖర విశృంఖల మేఖలయా
సకచ గ్రహచుంబనదానమ్ ॥సఖిహే॥

చ. 7. రతి సుఖసమయ రసాలసయాదర
ముకుళిత నయనసరోజమ్
నిస్సహనిపతిత తనులతయామధు
సూదనముదిత మనోజమ్ ॥సఖిహే॥

చ. 8. శ్రీజయదేవభణిత మిద మతిశయ
మధురపు నిధువనశీలమ్
సుఖముత్కంఠిత రాధికయా
కథితం వితనోతు సలీలమ్ ॥సఖిహే॥

---

శ్లో॥ హస్తస్రస్తవిలాస వంశమనృజు భ్రూవల్లిమ ద్వల్లవీ
బృన్దోత్సాహ దృగంతవీక్షితమతి స్వేదార్ద్రి గండస్థలమ్
మాముద్వీక్ష్య విలక్షితస్మిత సుధా ముగ్ధాననం కాననే
గోవిన్దం వ్రజసున్దరీ పరివృతం పశ్యామి హృష్యామిచ॥
దురాలోకస్తోక స్తబక నవకాశోక లతికా
వికాసః కాసారో పవనపవనోయం వ్యథయతి।
అపిభ్రామ్య ద్భృంగీ రణితరమణీయాన ముకుళ
ప్రసూతి శ్చూతానాం సఖిశిఖరిణీయం సుఖయతి ॥
సాకూతస్మిత మాకులాకుల గళద్ధమ్మిల్ల ముల్లాసిత
భ్రూవల్లీకమలీక దర్శిత భుజామూలార్ధ దృష్టి స్తనమ్।
గోపీనాం నిభృతం నిరీక్ష్యగమితా కాంక్షశ్చిరం చిన్తయఞ్
అన్తర్ముగ్ధమనోహరం హరతువః క్లేశం నవః కేశవః ॥

## ఆరవ అష్టపది (భావప్రకాశిక)

[రాధ తన చెలిని చూచి నా విరహ బాధను శ్రీకృష్ణునికి తెలిపి ఏలాగైనా అతణ్ని తోడి తెమ్మని వేడుకుంటున్నది.]

1. మనస్సులో క్రీడోత్సాహం పొంగిపొరలుతూ వుండగా ఆ ఉత్సాహాన్ని వెల్లడించే లక్షణాలతో మన్మథ వికారాలతో కూడిన శ్రీ కృష్ణునితో నన్ను రమింపజేయుము.

2. తొలి పొందునాడు మిక్కిలి సిగ్గుతోవున్న నన్ను చమత్కారపు మాటలతో తనకు అనుకూలపడేటట్లు చేసుకున్నవాడు, చిరునవ్వుతో తీయని మాటలతో నన్ను వశపరచుకుని కటివస్త్రాన్ని వదలించినవాడైన శ్రీకృష్ణునితో నన్ను రమింపచేయి.

3. చిగురాకు పానుపుమీద పరుండివున్న నా యెదమీదనే చాలసేపు శయనించి యుండినవాడు, కౌగిలించుకుని ముద్దులాడుతూ వున్నప్పుడు అధరామృత పానం చేసినవాడు ఐన శ్రీ కృష్ణునితో నన్ను రమింపచేయి.

4. క్రీడా విలాసాలలో పాల్గొని అలిసిపోయి అరగన్ను పెట్టి పడకపై పడివున్న నాతో పులకించిన గండస్థలము కలవాడై శ్రమవల్ల కలిగిన స్వేదముగల శరీరంతోవున్న నన్ను చూచి మిక్కిలి అనురాగం పొందిన శ్రీకృష్ణునితో నన్ను రమింపజేయి.

5. కోయిల కూతలవంటి మధురస్వరం చేస్తూ నాచే మన్మథ క్రీడతో జయింపబడినవాడూ, చెదరిన పువ్వులతో వీడిన కొప్పులతో నఖక్షతాలతో కూడిన స్తనభారం గల నన్ను శ్రీకృష్ణునితో రమింపజేయి.

6. పాదాలలోని అందెలు మెరుస్తుండగా మన్మథ క్రీడలందు పాల్గొని, మొలనూలు మిక్కిలి శబ్దించుచుండగా తలముడి పట్టుకుని ముద్దులాడి సంతోషపెట్టిన శ్రీకృష్ణునితో నన్ను రమింపజేయుము.

చ. 8. వర్ణితం జయదేవకేన
హరే రిదం ప్రవణేన
కిందుబిల్వ సముద్రసంభవ
రోహిణీ రమణేన ॥హరి॥

---

శ్లో॥ హృదిబిసలతాహారో సాయం భుజంగమనాయకః
కువలయదళశ్రేణీ కంఠే సాగరళద్యుతిః।
మలయజరజోనేదం భస్మప్రియారహితేమయి
ప్రహరన హరభ్రాన్త్యా నంగ క్రుథాకిముధావసి॥

పాణౌ మాకురు చూతసాయకమముం చాపమారోపయ
క్రీడానిర్జిత విశ్వమూర్ఛిత జనాఘాతేన కింపౌరుషమ్।
తస్యాఏవమృగీదృశో మనసిజ ప్రేంఖత్కటాక్షాశుగ
శ్రేణీజర్ఝరితం మనాగపిమనో నాద్యాపి సంధుక్షతే॥

భ్రూచాపేనిహితః కటాక్ష విశిఖోనిర్మాతు మర్మవ్యథాం
శ్యామాత్మా కుటిలః కరోతుకబరీ భారోపి మారోద్యమమ్।
మోహం తావదయంచ తన్వితనుతాం బింబాధరోరాగవా
సద్వృత్త స్తనమణ్డలం తవకథం ప్రాణైర్మమక్రీడతి॥

తానిస్పర్శ సుఖానితేచ సరళాస్స్నిగ్ధా దృశోర్విభ్రమా
స్తద్వక్త్రాంబుజ సౌరభం సచసుధాస్యందీగిరాం వక్రిమా।
సాబింబాధర మాధురీతి విషయాసంగేపి చేన్మానసమ్
తస్యాం లగ్నసమాధి హన్త విరహవ్యాధిః కథం వర్తతే॥

హృదిబిసల తాహారో నాయం భుజంగమనాయకః
కువలయదళశ్రేణీ కణ్ఠే న సాగరళద్యుతిః

మలయజరజోనేదం భస్మ ప్రియారహితే మయి
ప్రహర న హరభ్రాన్త్వా అనంగకృతా కిముధావసి॥

పాణౌమాకురు చూతసాయకమముం మాచాపమారోపయ
క్రీడానిర్జిత విశ్వమూర్ఛిత జనాఘాతేనకిం పౌరుషమ్।
తస్యాయేవ మృగీదృశో మనసిజ ప్రేంఖత్ కటాక్షాశుగ
శ్రేణీజర్జరితం మనాగపిమనో నాద్యాపి సంధుక్షతే॥

భ్రూపల్లవం ధనురపాంగ తరంగితాని
బాణాః గుణః శ్రవణ పాళిరితి స్మరేణ।
తస్యామనంగ జయజంగమ దేవతాయామ్
అస్త్రాణి నిర్జితజగంతి కిమర్పితాని ॥

భ్రూచాపేనిహితః కటాక్షవిశిఖో నిర్మాతు మర్మవ్యథామ్
శ్యామాత్మా కుటిలఃకరోతు కబరీభారోపి మారోద్యమమ్।
మోహంతావదయంచ తన్వితనుతాం బింబాధరోరాగవాౝ
సద్వృత్త స్తనమండలం తవకథం ప్రాణైర్మమక్రీడతి॥

తానిస్పర్శ సుఖాని తేచసరళాః స్నిగ్ధాదృశోర్విభ్రమాః
తద్వక్త్రాంబుజ సౌరభం సచసుధా స్యందీగిరా వక్రిమా।
సాబింబాధర మాధురీతి విషయా సంగేపిచేన్మానసమ్
తస్యాం లగ్నసమాధి హస్తవిరహవ్యాధిః కథంవర్తతే॥

తిర్యగ్గండ విలోలమౌళి తరళోత్తంసస్య వంశోచ్చరత్
గీతస్థాన కృతావధాన లలనాలక్షైర్న సంలక్షితాః
సమ్ముగ్ధం మధుసూదనస్య మధురే రాధాముఖేన్దౌ మృదు
స్యందం కందళి తాశ్చిరం దదతువః క్షేమంకటాక్షోర్మయః ॥

చ. 4. వహతి చ గలితవిలోచనజలధర
మానన కమలముదారమ్
విధు మివ వికటవిధుంతుదదంత
దళనగళితామృతధారమ్ ॥సా॥

చ. 5. విలిఖతి రహసి కురంగమదేన
భవంత మసమశరభూతమ్
ప్రణమతి మకర మదోవినిదాయ
కరేచ శరం నవచూతమ్ ॥సా॥

చ. 6. ప్రతిపద మిదమపినిగదతి మాధవ
తవచరణే పతితాహమ్
త్వయివిముఖేమయి సపదిసుధానిధి
రపితనుతే తనుదాహమ్ ॥సా॥

చ. 7. ధ్యానలయేన పురః పరికల్ప్య
భవంత మతీవ దురాపమ్
విలపతి హసతి విషీదతి రోదతి
భ్రమతి విముంచతి తాపమ్ ॥సా॥

చ. 8. శ్రీ జయదేవభణిత మిద మధికమ్
యది మనసా నటనీయమ్
హరి విరహాకుల వల్లవ యువతి
సఖీవచనం పఠనీయమ్ ॥సా॥

ఎనిమిదవ అష్టపది (భావప్రకాశిక)

[చెలి శ్రీకృష్ణునితో రాధ విరహంతో పడు
తున్న వేదనను ఇలా వర్ణించి చెబుతున్నది]

1. శ్రీకృష్ణా! మన్మథబాణాలకు భయపడి నీయందే లగ్న మైన మనస్సుతో రాధ దీనురాలై దుఃఖిస్తున్నది. మలయానిలాన్ని సర్పములు వసించే మలయ పర్వతాలనుండి వీస్తున్నదగుటవల్ల విషంతో కూడినదనే భయపడుతున్నది.

2. ఎడతెగకుండా తన హృదయంలో నాటుకొంటున్న మన్మథబాణాలనుంచి తన హృదయంలో వసిస్తున్న నీకు ఏ కీడు కలగకుండా రక్షించాలనే కోరికతో జల బిందువులతో కూడిన తామ రాకుల్ని కవచంలా తన యెదకు కప్పుకుంటున్నది.

3. మన్మథ బాణాలవల్ల ఐన శరతల్పంలా వున్న చిగురాకు పాన్పుమీద పడి నీ ఆలింగన సుఖంకోసం వ్రతం, తపం చేస్తున్న ట్లున్నది రాధ.

4. వికటములైన రాహువుయొక్క కోరలచే కరవబడినందు వల్ల కలిగిన గాయాలనుండి చంద్రబింబంలోని అమృతం ధారగా కురుస్తున్నట్లు కండ్లనుండి నీళ్లు స్రవిస్తూ వున్న ముఖంతో పరితపి స్తున్నది రాధ.

5. రహస్యంగా కస్తూరితో మన్మథునికి సాటివచ్చే నీయొక్క రూపాన్ని లిఖిస్తున్నది. తర్వాత మకరధ్వజాన్ని చేతిలో మామిడి చిగుళ్ళనే బాణాన్ని లిఖించి ఆ చిత్రానికి నమస్కరిస్తూ వుంది.

6. మాటిమాటికి 'మాధవా! నీ పాదాలమీద పడివున్నాను. నన్ను నీవు అలక్ష్యంచేసి పెడమొగం పెట్టినందువల్ల ఈ చంద్రుడు గూడా నన్ను చులకనజేసి ఎంతో బాధకలిగిస్తున్నాడు.

7. ధ్యానంలో చిత్తాన్ని ఏగాగ్రంచేసి ఎదుటనిన్నే కల్పించు కుని విచారపడుతున్నది, నవ్వుతున్నది, దుఃఖిస్తున్నది. ఏడుస్తూ వుంది. కలవరిస్తూ తన తాపాన్ని మాటలతో వెల్లడిస్తూ వున్నది.

8. హరి విరహంతో రాధ పడుతున్న వేదనల్ని చెలి శ్రీకృష్ణునికి చెప్పిన విధాన్ని వర్ణిస్తూ జయదేవకవి రచించిన ఈ గీతం భగవద్విరహాన్ని పొందిన భక్తులు అవశ్యం పఠింపతగ్గది.

## అష్టపది - 9

రాగం : బిలహరి తాళం : త్రిపుట

### శ్లోకమ్

ఆవాసో విపినాయతే ప్రియసఖీమాలాపి జాలాయతే
తాపోऽనిశ్వసితేన దావదహన జ్వాలాకలాపాయతే ।
సాపి త్వద్విరహేణ హంత హరిణీరూపాయతే హా కథమ్
కన్దర్పోऽపి యమాయతే విరచయన్ శార్దూలవిక్రీడితమ్ ॥

చ. 1. స్తనవిహిత మపి హార ముదారమ్
సా మనుతే కృశతను రివ భారమ్

ప. రాధికా కృష్ణా! రాధికా
రాధికా విరహే తవ కేశవ ॥రాధికా॥

చ. 2. సరసమసృణ మపి మలయజపంకమ్
పశ్యతి విష మివ వపుషి సశంకమ్ ॥రాధికా॥

చ. 3. శ్వసితపవన మనుపమపరిణాహమ్
మదనదహన మివ వహతి సదాహమ్ ॥రాధికా॥

చ. 4. దిశి దిశి కిరతి సజలకణజాలమ్
నయననళిన మివ విగళితనాళమ్ ॥రాధికా॥

చ. 5. నయనవిషయ మపి కిసలయతల్పమ్
కలయతి విహిత హుతాశనకల్పమ్ ॥రాధికా॥

చ. 6. త్యజతి న పాణితలేన కపోలమ్
బాలశశిన మివ సాయమలోలమ్ ॥రాధికా॥

చ. 7. హరి రితి హరి రితి జపతి సకామమ్
విరహ విహిత మరణేవ నికామమ్ ॥రాధికా॥

చ. 8. శ్రీజయదేవభణిత మితి గీతమ్
సుఖయతు కేశవపద ముపనీతమ్ ॥రాధికా॥

---

శ్లో॥ స్మరాతురాం దైవత వైద్యహృద్య!
త్వదంగ సంగామృత మాత్ర సాధ్యామ్।
నివృత్తబాధాం కురుషేనరాధా
ముపేంద్ర! వజ్రాదపి దారుణోసి॥

కందర్ప జ్వర సంజ్వరాకుల తనోరాశ్చర్య మస్యాశ్చిరమ్
చేతశ్చందన చంద్రమః కమలినీ చింతాను సంతామ్యతి।
కింతుక్లాంతివశేన శీతలతరం త్వామేకమేవ ప్రియమ్
ధ్యాయన్తీ రహసిస్థితా కథమపి క్షీణాక్షణం ప్రాణితి॥

క్షణమపి విరహః పురానసేహే
నయన నిమీలన ఖిన్న యానయాతే।
శ్వసతి కథమసౌ రసాలశాఖామ్
చిరవిరహేణ విలోక్య పుష్పితాగ్రామ్॥

వృష్టివ్యాకుల గోకులావనదశా దుద్ధృత్య గోవర్ధనమ్
బిభ్రత్ వల్లవ వల్లభాభి రధికానందా శ్చిరంచుమ్బితః।
దర్పేణేవ తదర్పి తాధరతటీ సిన్ధూర ముద్రాఙ్కితో
బాహుర్గోపతనోః తనోతు భవతాం శ్రేయాంసి కంసద్విషః॥

## తొమ్మిదవ అష్టపది (భావప్రకాశిక)

[చెలి శ్రీకృష్ణుణ్ని చూచి 'కృష్ణా! రాధ విరహ బాధవల్ల ఉన్మత్తురాలై పోయింది. వెంటనే నీవు వచ్చి అనుగ్రహించకపోతే ప్రాణాలు నిలవవు' అని విన్నవించుకుంటున్నది.]

1. కృష్ణా! విరహంవల్ల చాల చిక్కిపోయి రాధ తన స్తన మండలంమీద వున్న ముత్యాలహారాన్ని కూడా చాల బరువుగా భావిస్తున్నది.

2. శరీరంలో పూసుకున్న గంధం విషపు పూతలా తలుస్తున్నది.

3. పొడవైన నిట్టూర్పులు దహిస్తున్న మన్మథాగ్నివలె సోకుతుండగా తపించిపోతున్నది.

4. జల బిందువుల్ని రాలుస్తూ కాడనుండి త్రుంపబడిన తామరలా కండ్లవెంబడి కన్నీళ్ళు స్రవిస్తు వుండగా దిక్కుదిక్కునా నీవు వస్తావన్న ఆశతో నిరీక్షిస్తూ చూస్తూ వున్నది.

5. కంటి ఎదుట వున్న చిగురాకు పాన్పును అగ్నిజ్వాలలని భ్రమిస్తున్నది.

6. సాయంకాలంలో కదలకున్న చంద్రునివలె వున్న చెక్కిలిలో చేర్చిన చేతిని తీయకున్నది.

7. హరిహరియని ప్రేమోన్మాదంతో నీపేరే జపంచేస్తున్నట్లు పలుకుతూ వున్నది. విరహంవల్ల మరణం ఏర్పడుతుందేమో.

8. శ్రీకృష్ణుని చరణాలను గురించిన జయదేవుని ఈగీతం అందరికీ శుభములనే కలిగింపగలదు.

## అష్టపది - 10

రాగం : ఆనందభైరవి తాళం : ఆది

శ్లోకమ్

అహ మిహ నివసామి యాహి రాధామ్
అనునయ మద్వచనేన చానయేథాః ।
ఇతి మధురిపుణా సఖీ నియుక్తా
స్వయ మిద మేత్య పునర్జగాద రాధామ్ ॥

చ. 1. వహతి మలయసమీరే మదన ముపనిధాయ
స్ఫుటతి కుసుమనికరే విరహిహృదయదళనాయ

ప. తవ విరహే వనమాలీ
సఖి! సీదతి రాధే! ॥తవ॥

చ. 2. దహతి శిశిర మయూఖే మరణ మనుకరోతి
పతతి మదన విశిఖే విలపతి వికలతరోతి ॥తవ॥

చ. 3. ధ్వనతి మధుప సమూహే శ్రవణ మపి దధాతి
మనసి చలిత విరహే నిశినిశి రుజ ముపయాతి ॥తవ॥

చ. 4. వసతి విపినవితానే త్యజతి లలితధామ
లుఠతి ధరణిశయనే బహు విలపతి తవ నామ ॥తవ॥

చ. 5. భణతి పికసమవాయే ప్రతిదిశ మనుయాతి
హసతి మనుజనిచయే విరహ మపలపతినేతి ॥తవ॥

చ. 6. స్ఫురతి కలరవరావే స్మరతి మణితమేవ
తవరతి సుఖవిభవే గణయతి సుగుణ మతీవ ॥తవ॥

చ. 7. త్వదభిధ శుభద మాసం వదతి నరిశృణోతి
తమపి జపతిసరసం యువతిషు నరతిముపైతి ॥తవ॥

చ. 8. భణతి కవిజయదేవే విరహవిలసితేన
మనసి రభసవిభవే హరి రుదయతు సుకృతేన ॥తవ॥

## పదవ అష్టపది (భావప్రకాశిక)

[రాధ విరహాన్ని చెలి వర్ణించి చెప్పగా కృష్ణుడు చింతతో ఆ చెలిని చూచి తనవద్దకి రాధను తోడి తేవలసిందని కోరుతాడు. ఆ చెలి రాధకు కృష్ణుని విరహాన్ని వర్ణించి చెబుతున్నది.]

1. మన్మథుణ్ణి తోడుగా చేసుకుని మందమారుతం వీస్తుండగా, పుష్పాలు విరహంతో బాధపడేవారి గుండెలు పగులునట్లు వికసిస్తుండగా, రాధా! వనమాలను ధరించిన వాడైన శ్రీకృష్ణుడు నీ యెడబాటువల్ల విరహంతో బాధపడుతున్నాడు.

2. చంద్రుడు తన్ను కాల్చివేయుచుండగా శ్రీకృష్ణుడు మరణవేదన పడుతున్నాడు. మన్మథుని బాణాలు తనమీద పడుచుండగా తాళలేక విలపిస్తున్నాడు.

3. తుమ్మెద ఝుంకారం వినలేక చెవులు మూసుకుంటున్నాడు. రాత్రులందు విరహం మనసును కలతపెట్టుచుండగా మిక్కిలి తాపాన్ని పొందుతున్నాడు.

4. రమణీయంగా వుండే గృహం వదలి అడవిలో పడివున్నాడు. భూమిమీదనే పడిపొర్లుతూ నీ పేరే చెప్పుకుంటున్నాడు.

5. కోకిలలు కూస్తూ వుండగా విని ఓర్వలేక దిక్కులవెంట పరుగిడుతున్నాడు. అందరూ చూచి నవ్వుతుండగా విరహాన్ని తాళలేక దాగుకుంటున్నాడు.

6. పావురాళ్ళ కూతలు విని క్రీడా సమయంలో నీవు చేసే వింత ధ్వనుల్ని స్మరిస్తున్నాడు. క్రీడా విలాసంవల్ల కలిగిన సుఖాన్ని మిక్కిలిగా పొగుడుతున్నాడు.

7. నీపేరుకల వైశాఖ విశాఖకు రాధ అని పేరున్నది, మాసాన్ని ఇతరులు పేర్కొంటున్నప్పుడు ఆసక్తితో వింటున్నాడు. అనురాగంతో దాన్ని జపిస్తున్నాడు. ఇతర స్త్రీలయెడ ఆశ చూప కున్నాడు.

8. శ్రీకృష్ణ విరహచేష్టల్ని జయదేవకవి వర్ణిస్తుండగా విన్న పుణ్యవంతుల మనస్సుల్లో శ్రీకృష్ణుడు ఆవిర్భవించునుగాక.

## అష్టపది - 11

రాగం : కేదారగౌళం — తాళం : ఆది

శ్లోకమ్

పూర్వం యత్ర సమం త్వయా రతిపతే రారాదితాస్సిద్ధయః
తస్మి న్నేవ నికుంజమన్మథమహాతీర్థే పున ర్మాధవః
ధ్యాయం స్త్వామనిశం జపన్నపితవై వాలాపమంత్రావళీమ్
భూయ స్త్వత్కుచకుంభనిర్భరపరీ రంభామృతం వాంఛతి ॥

చ. 1. రతిసుఖసారే గత మభిసారే
మదనమనోహర వేషమ్
న కురు నితంబిని గమనవిళంబన
మనుసర తం హృదయేశమ్

ప. ధీరసమీరే యమునాతీరే
వసతి వనే వనమాలీ
గోపీ పీన పయోధర మర్దన
చంచల కరయుగశాలీ ॥ధీర॥

చ. 2. నామసమేతం కృతసంకేతమ్
వాదయతే మృదువేణుమ్

బహుమనుతే తనుతే తనుసంగత
పవనచలిత మపి రేణుమ్ ॥ధీర॥

చ. 3. పతిత పత్రే విచలతి పత్రే
శంకిత భవదుపయానమ్
రచయతి శయనం సచకితనయనమ్
పశ్యతి తవ పంథానమ్ ॥ధీర॥

చ. 4. ముఖర మధీరం త్యజ మంజీరమ్
రిపు మివ కేళిషు లోలమ్
చల సఖి! కుంజం సతిమిరపుంజమ్
శీలయ నీలనిచోలమ్ ॥ధీర॥

చ. 5. ఉరసి మురారే రుపహితహారే
ఘన ఇవ తరళబలాకే
తటిదివ పీతే రతివిపరీతే
రాజసి సుకృతవిపాకే ॥ధీర॥

చ. 6. విగళితవసనం పరిహృతరశనమ్
ఘటయ జఘన మపిధానమ్
కిసలయశయనే పంకజనయనే
నిధి మివ హర్ష నిదానమ్ ॥ధీర॥

చ. 7. హరి రభిమానీ రజని రిదానీ
మియ మపియాతి విరామమ్
కురు మమవచనం సత్వరరచనమ్
పూరయ మధురిపుకామమ్ ॥ధీర॥

చ. 8. శ్రీజయదేవే కృతహరిసేవే
భణతి పరమరమణీయమ్

ప్రముదిత హృదయం హరిమతిసదయమ్
నమత సుకృత కమనీయమ్ ॥ధీర॥

---

శ్లో॥ సామాం ద్రక్ష్యతి వక్ష్యతి స్మరకథాః ప్రత్యంగమాలింగనైః
ప్రీతిం యాస్యతి రంస్యతే సఖిసమాగత్యేతి చింతాకులః।
నత్వాంపశ్యతి వేపతేపులక యత్యానందతి స్వేదతి
ప్రత్యుద్గచ్ఛతి మూర్ఛతి స్థిరతమః పుంజే నికుంజేస్థితః॥

వికిరతి ముహుఃశ్వాసా నాశాఃపురో ముహురీక్షతే
ప్రవిశతి ముహుఃకుంజం గుంజన్ముహుర్ బహుధామ్యతి।
రచయతిముహు శ్శయ్యాం పర్యాకులం ముహురీక్షతే
మదనకదన క్లాంతః కాంతేప్రియ స్తవ వర్తతే॥

త్వద్వాక్యేన సమం సమగ్రమధునా తిగ్మాంశు రస్తంగతో
గోవిందస్య మనోరథేనచ సమంప్రాప్తం తమస్సాంద్రతామ్।
కోకానాం కరుణస్వనేన సదృశీ దీర్ఘామదభ్యర్థనా
తన్ముక్తే విఫలం విలంబనమసౌ రమ్యోభిసారేక్షణః॥

ఆశ్లేషా దనుచుంబనా దనునఖోల్లేఖాదనుస్వాంతజ
ప్రోద్బోధాదను సంభ్రమాదనురతా రంభాదనుప్రీతయోః।
అన్యార్థం గతయోర్భ్రమామిళిత యోస్సంభాషణైర్జానతోః
దంపత్యోరిహ కోనుకోనుతమసి వ్రీడావిమిశ్రోరసః॥

అతిచకితం విన్యస్యంతీం దృశౌ తిమిరేపథి
ప్రతితరుముహుస్థిత్వా మందంపదాని వితన్వతీమ్।
కథమపిరహః ప్రాప్తామంగై రనంగ తరంగిభి
స్సుముఖి సుభగః పశ్యన్ సత్వాముపైతు కృతార్థతామ్॥

రాధాముగ్ధ ముఖారవిన్ద మధుపః త్రైలోక్య మౌలిస్థలీ
నేపథ్యోచిత నీలరత్నమవనీ భారావతారాన్తకః।
స్వచ్ఛన్దం వ్రజసున్దరీ జనమనస్తోష ప్రదోషశ్చిరమ్
కంసధ్వంసన ధూమకేతురవతు త్వాం దేవకీనన్దనః॥

## పదకొండవ అష్టపది (భావప్రకాశిక)

[శ్రీకృష్ణునొద్దకు త్వరగా పొమ్మని చెలికత్తె రాధను ప్రేరేపిస్తున్నది.]

1. క్రీడాసుఖం నిండుగా ఉన్న సంకేత స్థానంలో నీకోసం ఎదురుచూస్తూ ఉన్నవాడై, నవమన్మథునిలా అలంకరించుకుని ఉన్న శ్రీకృష్ణునొద్దకు పో ఆలస్యం చేయకు. మనసుకు ఇంపుగా గాలి వీస్తున్న యమునానదీ తీరంలో గోపికలు బలిసిన పాలిండ్లను మర్దించుటలో ఆసక్తి చూపు చేతులుగల శ్రీకృష్ణుడు వనమాలాధరుడు నీకోసం కాచుకుని ఉన్నాడు.

2. నీపేరు. సంకేతస్థలం ధ్వనించేటట్లు చెవులకు ఇంపు గలిగిస్తూ వేణువును ఊదుచున్నాడు. నీ శరీరం మీదుగా మిక్కిలి పరిమళంతో వీస్తున్న పుష్పపరాగాలతో కూడిన వాయువుల్ని అభిమానిస్తున్నాడు.

3. చెట్ల ఆకులు రాలుచుండగా, గాలికి ఆకులు కదలుచుండగా ఆ చప్పుడు విని నీవు వస్తున్నట్లుగా సందేహించి చిగురు పాన్పును సిద్ధపరుస్తున్నాడు. చంచల దృష్టులతో నీవు వస్తున్న మార్గాన్ని చూస్తూ ఉన్నాడు.

4. కదులుతూ శబ్దం చేస్తున్న ఈ అందెల్ని కేళీవిలాసానికి శత్రువుగా తలచి వదలించేయి. చీకటితో కూడుకున్న శ్రీకృష్ణుడు

వసిస్తున్న పాదసమీపం చేరుకో. నీలవర్ణం గల రవిక, చీర, ధరించు.

5. రాధా! నీవు బంగారువన్నె కల శరీరం కలదానివి. కదలి పోతున్న కొంగల గుంపుతో కూడిన నల్లనిమేఘంలా ముత్యాల దండలు కదలుతూ ఉన్న శ్రీకృష్ణుని వక్షస్థలం మీద నీవు మేఘంలో మెరుపులా శయనించి యుండగలవు.

6. తామరలవంటి కన్నులు కలదానా! మొలనూలు, కటి వస్త్రం వదలి ఏ కప్పులేకుండా ఉండే జఘన స్థలాన్ని చిగురాకు పడకపై సంతోషమనే ధనానికి నిక్షేపంలా చేర్చు.

7. శ్రీకృష్ణుడు నీయందు ఎంతో అనురాగంతో ఉన్నాడు. రాత్రి ముగియబోతున్నది. త్వరలో అలంకరించుకుని బయలుదేరు. శ్రీకృష్ణుని కోరికల్ని తీర్చు.

8. శ్రీకృష్ణుని బాగా సేవించిన జయదేవకవి చాల మనోహ రంగా రచించిన ఈ గీతం ఆలకించి సంతోషంతో పొంగుతున్న మనస్సులో శ్రీకృష్ణుని తలచి పుణ్యాత్ములు నమస్కరింతురుగాత.

## అష్టపది - 12

రాగం : శంకరాభరణం తాళం : త్రిపుట

### శ్లోకమ్

అథతాంగంతు మశక్తాంచిరమనురక్తాంలతాగృహేదృష్ట్వా।
తచ్చరితం గోవిందే మనసిజమందే సఖీ ప్రాహ॥

చ. 1. పశ్యతి దిశిదిశి రహసి భవంతమ్
త్వదధర మధురమధూని పిబంతమ్

ప. నాథ హరే జగన్నాథ హరే
సీదతి రాధా వాసగృహే ॥నాథ॥

చ. 2. త్వదభిసరణ రభసేన వసంతీ
పతతి పదాని కియంతి చలంతీ ॥నాథ॥

చ. 3. విహిత విశదబిసకిసలయవలయా
జీవతి పర మిహ తవ రతికలయా ॥నాథ॥

చ. 4. ముహు రవిలోకిత మండనలీలా
మధురిపు రహ మితి భావనశీలా ॥నాథ॥

చ. 5. త్వరిత ముపైతి న కథ మభిసారమ్
హరి రితి వదతి సఖీ మనువారమ్ ॥నాథ॥

చ. 6. శ్లిష్యతి చుంబతి జలధరకల్పమ్
హరి రుపగత ఇతి తిమిర మనల్పమ్ ॥నాథ॥

చ. 7. భవతి విలంబిని విగళితలజ్జా
విలపతి రోదతి వాసకసజ్జా ॥నాథ॥

చ. 8. శ్రీజయదేవకవే రిద ముదితమ్
రసికజనం తనుతా మతిముదితమ్ ॥నాథ॥

---

శ్లో॥ విపులపులక పాళిః స్ఫీత సీత్కారమంత
ర్జనిత జడిత కాకువ్యాకులం వ్యాహరంతీ।
తవ కితవ విధత్తేఽమందకం దర్పచింతామ్
రసజలధి నిమగ్నా ధ్యానలగ్నా మృగాక్షీ॥
అంగేష్వాభరణం కరోతి బహుశః పత్రేతి సంచారిణీ
ప్రాప్తంత్వాం పరిశంకతే వితనుతే శయ్యాంచిరం ధ్యాయతి।

ఇత్యాకల్ప వికల్ప తల్పరచనా సంకల్ప లీలాశత
వ్యాసక్తాపి వినాత్వయా వరతను ర్నైషాంనిశా నేష్యతి॥
కింవిశ్రామ్యసి కృష్ణభోగిభవనే పాండీరభూమీరుహి
ప్రాతర్యాహిన దృష్టిగోచరమితః సానన్ద నన్దాస్పదమ్ ।
రాధాయాః వచనం దధత్వఘముఖా న్నందాంతికే గోపతో
గోవిందస్య జయంతి సాయమదితి ప్రాశస్త్య గర్భాగిరః॥

## పంద్రెండవ అష్టపది (భావప్రకాశిక)

[చెలి రాధను ఒక పొదరింటిలో ఉంచి శ్రీకృష్ణు నొద్దకు పరుగెత్తిపోయి రాధ స్థితిని, మన్మథ తాపంతో ఆమె ఎక్కువ దూరం నడవలేకుండే స్థితిని తెలుపుతున్నది. ఈ అష్టపదిలోనే 'జగన్నాథ' అని పూరి జగన్నాథస్వామి పేర్కొనబడడంవల్ల ఈ గీతాన్ని పలుసార్లు భక్తులు గానం చేస్తారు.]

1. ఇక్కడ 'నాథహరే' అనడంలో ఒక వ్యంగం ఉంది. 'నాసారజ్జుం హరతి గృహ్ణాతీత నాథహారిః' అని ముక్కు కుట్టబడిన ఎద్దుకుగూడా నాథహారి అని పేరున్నది. కాబట్టి రాధ విరహాన్ని గుర్తించి ఆమెను ఓదార్చక ముక్కుకుట్టిన ఎద్దులా ఉన్నావనే నింద ధ్వనించును.

2. నిన్ను పొందాలనే ఉత్సాహం పొంగి ఉన్న మనస్సుతో రాధ కొన్ని అడుగులు వేయగానే అవశురాలై క్రిందపడిపోతున్నది.

3. తామర తూండ్లను తాపాన్ని పోగొట్టుకోడానికి కర వలయాలుగా తొడుగుకుని నీతో క్రీడాసౌఖ్యం అనుభవించాలన్న ఆశతోనే ఈ వనంలో బతికి ఉంది.

4. రమ్యమైన అలంకారాలతో నేనే శ్రీకృష్ణుడు అని నీమీది తన్మయ చిత్తంతో భావిస్తున్నది.

5. చెలికత్తెలతో 'సంకేతస్థలానికి ఇంకా శ్రీకృష్ణుడు రాకున్నాడేమే' యని విలంబనము ఓర్చుకోలేక పలుకుతున్నది.

6. నీలమేఘంలా చుట్టుకుని ఉన్న చీకటిని నీవేయని భ్రాంతిపడి కౌగిలించుకుని ముద్దాడుచున్నది.

7. పడకలో నీకై ఎదురుచూస్తున్న వాసకసజ్జ అనే నాయిక ఐన రాధ నీవు ఆలస్యం చేయడంవల్ల సిగ్గువీడి ప్రలాపిస్తున్నది.

8. శ్రీకృష్ణ విరహంతో రాధ ఉన్నస్థితిని చెలి శ్రీకృష్ణునికి తెలిపిన విధాన్ని జయదేవకవి రమ్యమైన గీతంలో వివరించాడు. ఈ గీతం రసికజనాల్ని మిక్కిలి సంతోషపెట్టెను.

## అష్టపది - 13

రాగం : అహిరి - నీలాంబరి తాళం : జంపె

### శ్లోకమ్

అత్రాంతరే చ కులటాకులవర్త్మపాత
సంజాతపాతక ఇవ స్ఫుటలాంచనశ్రీః ।
బృందావనాంతర మదీపయ దంశుజాలైః
దిక్ సుందరీవదన చందనబిందురిందుః ॥

ప్రసరతి శశధరబింబే
విహతవిలంబే చ మాధవే విధురా ।
విరచిత వివిధవిలాపా
సా పరితాపం చకారోచ్చైః ॥

చ. 1. కథిత సమయే పిహారి
రహాహా! న యయౌ వనమ్
మమ విఫల మిద
మమలరూప మపి యౌవనమ్

ప. యామి హే! క మిహ శరణమ్
సఖీ జనవచన వంచితాహమ్ ॥యామి॥

చ. 2. యదనుగమనాయ నిశి
గహన మపి శీలితమ్
తేన మమ హృదయ మిద
మసమ శరకీలితమ్ ॥యామి॥

చ. 3. మమ మరణ మేవ వరమ్
అతి వితథ కేతనా
కి మితి విషహామి
విరహానల మచేతనా ॥యామి॥

చ. 4. అహాహా! కలయామి
వలయాది మణిభూషణమ్
హరివిరహా దహానవహా
నేనబహు దూషణమ్ ॥యామి॥

చ. 5. మా మహాహా విధురయతి
మధుర మధుయామినీ
కాపి హరి మనుభవతి
కృత సుకృత కామినీ ॥యామి॥

చ. 6. కుసుమసుకుమార తను
మతనుశర లీలయా

స్రగపి హృది హంతి మా
మతి విషమశీలయా ॥యామి॥

చ. 7. అహమిహ హి నివసామ్య
నవగణిత వేతసా
స్మరతి మధుసూదనో
మా మపి న చేతసా ॥యామి॥

చ. 8. హరి చరణ శరణ
జయదేవకవి భారతీ
వసతు హృది యువతి రివ
కోమలకలావతీ ॥యామి॥

---

శ్లో॥ తత్కిం కామపి కామినీ మభిసృతః కిం వా కళాకేళిభి
ర్బద్ధో బంధుభి రంధకారిణివ నాభ్యర్ణే కిముభ్రామ్యతి।
కాంతః క్లాంతమనామనాగపి పథి ప్రస్థాతుమే వాక్షమః
స్సంకేతీకృత మంజువంజుళలతా కుంజేపి యన్నాగతః॥

## పదమూడవ అష్టపది (భావప్రకాశిక)

[పదమూడవ అష్టపదిలో చంద్రోదయ వర్ణన కలదు. రాధకు కృష్ణునికి చంద్రోదయం చాల తాపాన్ని కలిగిస్తున్నది. ఇంకా కృష్ణుడు రాలేదేమని రాధ చింతిస్తున్నది. శ్రీకృష్ణునితో వేరొక గోపిక రమిస్తున్నట్లు భావిస్తూ దాన్ని వర్ణిస్తున్నది. వేరొక జీవుడు భగవదనుభవంతో ఆనందమగ్నుడై ఉండడం చూచిన భక్తుడు తాను తృప్తిపడడం అనే భక్తిభావం ఈ గీతంలో వ్యంగ్యం. దీన్ని శాస్త్రజ్ఞులు 'తత్సుఖ సుఖిత్వం' అంటారు.]

1. రాధ ఇలా చెలితో చెప్పుకుని విలపిస్తున్నది. చెప్పిన సమయానికి కృష్ణుడు సంకేతస్థలానికి రాకున్నాడు. నా స్వచ్ఛమైన అందం, యౌవనం ఇవన్నీ వ్యర్థములౌతున్నాయి. చెలి మాటలచేత వంచించబడ్డాను. ఎవరిని శరణు వేడుకోగలను!

2. ఏ కృష్ణుని వెంబడించిపోవడానికి దట్టమైన ఈ అడవిలో చొరబడి వచ్చానో, ఆ కృష్ణునివల్ల నా మనస్సు మన్మథబాణాలకు గురియై బాధపడుతున్నది.

3. కృష్ణుడు రానందువల్ల వ్యర్థమైన ఈ సంకేత స్థానంలో వివేకహీనురాలనై విరహాగ్నిని ఎలా ఓర్చుకోగలను! ఇంతకన్నా మరణమే మేలుకదా.

4. పుణ్యాత్మురాలైన ఏ గోపిక శ్రీకృష్ణునితో క్రీడిస్తున్నదో, ఈ వసంత రాత్రి నన్ను చాల బాధపెట్టుతున్నది.

5. శ్రీకృష్ణుడు లేక నేను విరహంతో బాధపడుతుండగా ఈ మణివలయాలు మొదలైన భూషణాలన్నీ నాకెందుకు? ఈ పాడు సొమ్ములు నాకు తాపాన్నే ఎక్కువ చేస్తున్నాయి.

6. ఈ పుష్పహారం స్వభావానికి విరుద్ధమైన గుణం పొంది పువ్వుకన్నా మృదువైన నా శరీరాన్ని పుష్పములే బాణముగాగల మన్మథుని వలని బాధలతోపాటు చాలా తాపం కూరుస్తున్నది.

7. లెక్కలేనన్ని ప్రబ్బలిచెట్లతో కూడిన ఈ పొదరింటిలో శ్రీకృష్ణునికై నేను వేచి ఉన్నాను. శ్రీకృష్ణుడు మనస్సులోనైనా నన్ను తలచకున్నాడే.

8. శ్రీహరి చరణములే శరణమని ఉన్న జయదేవకవి రచించిన ఈ గీతం మృదులములైన కళలతో గూడిన యువతివలె చదివి గానము చేసేవారి మనస్సులలో ఉండునుగాక.

## అష్టపది - 14

రాగం : సారంగ  తాళం : త్రిపుట

### శ్లోకమ్

అథాగతాం మాధవమంతరేణ
సఖీ మియం వీక్ష్య విషాదమూకామ్।
విశంకమానా రమితం కయాపి
జనార్దనం దృష్టవదేతదాహ॥

చ. 1. స్మరసమరోచిత విరచితవేషా
గళిత కుసుమభరవిలుళిత కేశా

ప. కాపి మధురిపుణా
విలసతి యువతి రత్యధిక గుణా ॥కాపి॥

చ. 2. హరిపరిరంభణ వలితవికారా
కుచకలశోపరి తరళితహారా ॥కాపి॥

చ. 3. విచలదలక లలితాననచంద్రా
తదధర పానరభసకృతతంద్రా ॥కాపి॥

చ. 4. చంచలకుండల లలితకపోలా
ముఖరితరశన జఘనగతిలోలా ॥కాపి॥

చ. 5. దయితవిలోకిత లజ్జితహసితా
బహువిధకూజిత రతిరసరసితా ॥కాపి॥

చ. 6. విపులపులక పృథువేపథుభంగా
శ్వసితనిమీలిత వికసదనంగా ॥కాపి॥

చ. 7. శ్రమజలకణభర సుభగశరీరా
పరిపతితోరసి రతిరణధీరా ॥కాపి॥

చ. 8. శ్రీజయదేవభణిత హరిరమితమ్
కలికలుషం జనయతు పరిశమితమ్ ॥కాపి॥

## పదునాల్గవ అష్టపది (భావప్రకాశిక)

[శ్రీకృష్ణునితో వేరొక గోపిక రమిస్తున్నట్లు భావించి రాధ చెలితో ఇట్లనుచున్నది.]

1. క్రీడలకు తగిన వేషంతో తలముడినుండి పువ్వులు రాలగా కుంతలాలు కొంచెము చెదరగా గుణాతిశయంగల గోపిక శ్రీకృష్ణునితో క్రీడిస్తున్నది.

2. శ్రీకృష్ణుడు కౌగిలించుకోవడంవల్ల కలిగిన మన్మథ వికారంతో బంగారు కలశాలవంటి స్తనాలమీద కదలియాడుచున్న ముత్యాల హారంతో గోపిక శ్రీకృష్ణునితో క్రీడిస్తున్నది.

3. చంద్రబింబంలాంటి ముఖంమీద ముంగురులు కదలుచుండగా, అధరామృతపానంవల్ల మత్తుగొన్నట్లు సోలుతూ ఒక గోపిక శ్రీకృష్ణునితో క్రీడిస్తున్నది.

4. కుంతలాలు చలించి చెక్కిళ్ళకు కాంతులు కూరుస్తుండగా జఘనాన్ని వింతగా కదిలిస్తూ ఒడ్డాణము వింత ధ్వనులు చేస్తుండగా ఒక గోపిక శ్రీకృష్ణునితో క్రీడిస్తున్నది.

5. క్రీడా సుఖంలో వివశురాలై వున్న తన్ను శ్రీకృష్ణుడు తదేక దృష్టితో చూడడంవల్లనూ సిగ్గుతో నవ్వుతూ, క్రీడాసుఖం వల్ల పలురకాల ధ్వనులు చేస్తూ శ్రీకృష్ణునితో ఒకానొక గోపిక క్రీడిస్తున్నది.

6. క్రీడించడంవల్ల బాగా పులకరించి ఒళ్ళు వణకుతూ వుండగా, నిట్టూర్పులతో కండ్లు సగం మూసి మన్మథ వికాసంతో ఒక గోపిక శ్రీకృష్ణునితో క్రీడిస్తున్నది.

7. క్రీడా శ్రమవల్ల కలిగిన స్వేదబిందువులతో అందంగులుకు శరీరంతో విలాసంలో ధీరురాలై ఒక గోపిక శ్రీకృష్ణుని రొమ్ములమీద వాలి క్రీడిస్తున్నది.

8. జయదేవ కవిచేత కీర్తింపబడిన హరివిలాసముల గురించిన ఈ గీతం కలివల్ల కలిగిన పాపల్ని పోగొడుతుంది.

## అష్టపది - 15

రాగం : సావేరి తాళం : ఆది

### శ్లోకమ్

విరహపాండు మురారి ముఖాంబుజ
ద్యుతి రయం తిరయన్నపి వేదనామ్।
విధు రతీవ తనోతి మనోభువః
సుహృదయే హృదయే మదనవ్యథామ్॥

చ. 1. సముదితమదనే రమణీవదనే
చుంబన లలితాధరే
మృగమదతిలకం లిఖతి సపులకమ్
మృగ మివ రజనీకరే

ప. రమతే యమునాపులినవనే
విజయీ మురారి రధునా ॥రమ॥

చ. 2. ఘనచయరుచిరే రచయతి చికురే
తరళిత తరుణాననే
కురవకకుసుమం చపలానుషమమ్
రతిపతి మృగకాననే ॥రమ॥

చ. 3. ఘటయతి సుఘనే కుచయుగ గగనే
మృగమదరుచి దూషితే
మణిసర మమలం తారకపటలమ్
నఖపద శశిభూషితే ॥రమ॥

చ. 4. జితబిసశకలే మృదుభుజయుగళే
కరతల నళినీదళే
మరకతవలయం మధుకరనిచయమ్
వికిరతి హిమశీతళే ॥రమ॥

చ. 5. రతిగృహజఘనే విపులాపఘనే
మనసిజకనకాసనే
మణిమయరశనాం తోరణహసనామ్
వికిరతి కృతవాసనే ॥రమ॥

చ. 6. చరణకిసలయే కమలానిలయే
నఖమణి గణపూజితే
బహిరపవరణం యావకభరణమ్
జనయతి హృది యోజితే ॥రమ॥

చ. 7. రమయతి సుదృశం కామపి సుభృశమ్
ఖలహలధరసోదరే
కి మఫల మవసం చిర మిహావిరసమ్
వద సఖి విటపోదరే ॥రమ॥

చ. 8. ఇహ రసభణనే కృతహరిగుణనే
మధురిపు పదసేవకే
కలియుగ చరితం న వసతు దురితమ్
కవినృపజయదేవకే ॥రమ॥

## పదహేనవ అష్టపది (భావప్రకాశిక)

[శ్రీకృష్ణుని వర్ణిస్తూ అలాంటి మంగళ స్వరూపునితో క్రీడిస్తున్న గోపిక కదా భాగ్యశాలి అని చెలితో రాధ పేర్కొంటున్నది.]

1. మురాసురుని జయించి విజయశీలుడైన శ్రీకృష్ణుడు ఇప్పుడు యమునా నదిలోని ఇసుక పట్టులలో గల వనంలో క్రీడిస్తున్నాడు. ముద్దు పెట్టుకోవడంవల్ల చలిస్తున్న పెదవులతో మన్మథ విలాసంతో ఒప్పుతున్న ఒక గోపికయొక్క చంద్ర బింబం లాంటి ముఖంలో కస్తూరి తిలకాన్ని పులకిస్తున్న చేతులతో దిద్దుతున్నాడు.

2. మన్మథుడనే మృగం సంచరించే అడవిలాగా ఒప్పుతూ మేఘమండలంలా వున్న ఒక గోపిక కురులలో మెరపులా కాంతులీనుతున్న గోరింట పువ్వులను తురుముతున్నాడు కృష్ణుడు.

3. కస్తూరి పూతలు దట్టంగా కలిగి చంద్రవంకల్లా నఖక్షతాలచే అలంకరింపబడిన ఒక గోపికయొక్క స్తనమండలమనే ఆకాశంలో నక్షత్రాల నమూహంలా మణిహారాలను పొందుగా అలంకరిస్తున్నాడు.

4. తామరతూండ్లకన్నా కోమలములై చల్లని తామర రేకుల్లాంటి హస్తములు కల గోపికల భుజయుగళంలో పచ్చల కడియాలను తుమ్మెదపిండులా ఒప్పునట్లు కూరుస్తున్నాడు.

5. రతిగృహంలా వున్న జఘనంతో విశాలమై మన్మథ సింహాసనమనేటట్లు సువాసలతో కూడిన గోపిక నడుమున (ఇంటి వాకిట) తోరణం కట్టినట్లు మణులతోనైన ఒడ్డాణం తొడుగుతున్నాడు శ్రీకృష్ణుడు.

6. లక్ష్మీదేవికి ఉనికిపట్టయి గోళ్ళనెడి మణుల సమూహంతో అలంకరించబడిన తన వక్షస్థలంలో దగిలిన గోపికయొక్క చిగురాకులవంటి మెత్తని పాదాలమీద చుట్టూ లత్తుక రేఖలనెడి ఆభరణాన్ని దిద్దుతున్నాడు శ్రీకృష్ణుడు.

7. హలాయుధాన్ని ధరించిన బలరాముని సోదరుడగు శ్రీకృష్ణుడు చూడడానికి అందం గలిగే ఒక గోపికతో కూడియుండడాన్ని తలచుకొంటూ, ఈ పొదరింటిలో వేచియుండడం నిష్ఫలం, సారహీనం కదా!

8. శృంగార రసభరితంగా శ్రీకృష్ణుని గుణాలను శ్రీహరి పాదసేవకుడు జయదేవ కవి వర్ణించి చెప్పిన ఈ గీతం కలియుగంలో పాపాలన్నిటినీ పోగొట్టేదిగా విలసిల్లుతుంది.

## అష్టపది - 16

రాగం : పున్నాగవరాళి తాళం : ఆది

### శ్లోకమ్

నాయాతస్సఖి! నిర్దయోయదిశఠ స్త్వందూతి! కిందూయసే!
స్వచ్ఛందం బహువల్లభ స్స రమతే కిం తత్రతే దూషణమ్।
పశ్యాద్యప్రియసంగమాయ దయిత స్యాకృష్యమాణంగుణై॥
ఉత్కన్ఠార్తి భరాదివ స్ఫుట దిదం చేత స్స్వయం యాస్యతి॥

చ. 1. అనిలతరళ కువలయనయనేన
తపతి న సా కిసలయశయనేన

ప. యా రమితా వనమాలినా సఖీ! ॥యా రమితా॥

చ. 2. వికసిత సరసిజ లలితముఖేన
స్ఫుటతి న సా మనసిజవిశిఖేన ॥యా రమితా॥

చ. 3. అమృత మధుర మృదుతరవచనేన
జ్వలతి న సా మలయజ పవనేన ॥యా రమితా॥

చ. 4. స్థలజలరుహ రుచికర చరణేన
లుఠతి న సా హిమకరకిరణేన ॥యా రమితా॥

చ. 5. సజల జలదసముదయ రుచిరేణ
దళతి న సా హృది విరహభరేణ ॥యా రమితా॥

చ. 6. కనక నిచయరుచి శుచివసనేన
శ్వసితి న సా పరిజనహసనేన ॥యా రమితా॥

చ. 7. సకలభువన జనవరతరుణేన
మహతి న సా రుజ మతికరుణేన ॥యా రమితా॥

చ. 8. శ్రీజయదేవభణిత వచనేన
ప్రవిశతు హరి రపి హృదయ మనేన ॥యా రమితా॥

---

శ్లో॥ మనోభవానందన చందనానిల
ప్రసీద రే దక్షిణముంచ వామతామ్ ।
క్షణం జగత్ప్రాణ నిధాయమాధవమ్
పురోమమ ప్రాణహరో భవిష్యతి॥
బాధాం విధేహి మలయానిల పంచబాణ
ప్రాణాన్ గృహాణ నపునర్గృహ మాశ్రయిష్యే ।
కింతే కృతాంత భగిని క్షమయాతరంగై
రంగాని సించ మమ శామ్యతు దేహదాహః ॥

సాన్ద్రానంత పురందరాది దివిషత్ బృన్దై రమందాదరాత్
ఆనమ్రైః మకుటేన్ద్ర నీలమణిభిస్సం దర్శితేన్దీవరమ్।
స్వచ్ఛన్దం మకరన్ద సుందరగళన్మందాకినీ మేదురమ్
శ్రీగోవిన్ద పదారవిందమశుభ స్కంధాయ వందామహే॥

## పదహారవ అష్టపది (భావప్రకాశిక)

[''నేనెంతో వేడుకుని శ్రీకృష్ణుని పిలవగా అతడు వస్తానని ఒప్పుకుని ఇంకా రాలేదే అని చెలి చెప్పగా విని రాధ సరే, అతడు వంచకుడే అనుకొందాం. నీ కర్తవ్యాన్ని నీవు చేశావు. ఇక ఏమవుతుందో అన్న చింత నీకెందుకు?'' అని రాధ అంటుంది. అందుకు చెలి ''శ్రీకృష్ణునికి ఎందరో వలపుకత్తెలు. వాళ్ళతో అతను హాయిగా ఉంటున్నాడు గదా'' అని నిందింపగా రాధ ''చెలీ! అది అతని దోషం గాదు. దైవిక సౌందర్యం, కల్యాణ గుణాలు అన్నీ అతనిలో నిండి ఉన్నాయి. అందరి హృదయాల్ని అవి ఆకర్షిస్తున్నాయి. ప్రేమ వివశలై చుట్టుకున్న కాంతల్ని అతడు ఎలా వదలించుకోగలడు? ఏ అదృష్టవంతురాలు అతనితో సుఖిస్తున్నదో కదా!'' అంటుంది.]

1. గాలికి కదలుచున్న కలువ పువ్వుల్లా ఉన్న కండ్లతో వనమాలితో రమిస్తున్న ఆ గోపిక నావలె చిగురాకుమీద విరహంతో తాపం పొందదు గదా.

2. వికసించిన తామరలా ఒప్పుతున్న ముఖమండలం గల శ్రీకృష్ణునితో క్రీడిస్తున్న వనిత నావలె మన్మథ బాణాలచే బాధింపబడదు.

3. అమృతంలా మధురములైన శ్రీకృష్ణుని మాటలు వింటూ అతనితో క్రీడించే యువతి నావలె మందమారుతం సోకి తాపం పొందదు.

4. నేలలో పుద్భవించిన తామరల్లా అందం గులుకు కరచరణాలుగల శ్రీకృష్ణునితో రమించే వనిత చంద్రకిరణాలు తగిలి బాధలో నావలె పొరలాడదు.

5. నీళ్ళతో పిక్కటిల్లిన మేఘంలా మెరుస్తున్న శ్రీకృష్ణునితో క్రీడిస్తున్న గోపిక నావలె విరహ భారంతో గుండెలవిసిపోయి బాధపడదు.

6. నిగనిగలాడు బంగారు పట్టువస్త్రంగల శ్రీకృష్ణునితో క్రీడిస్తున్న ముగ్ధ నాలా చెలికత్తెల పరిహాస వచనాలు విని నిట్టూర్పులు విడువదు.

7. అన్ని భువనాలలో వున్న వారందరికన్నా శ్రేష్ఠుడై తరుణుడై యున్న శ్రీకృష్ణుని పొందుతో కులుకుచున్న గోపిక నావలె మిక్కిలి కరుణకు ఉనికిపట్టయి తాపంతో బాధపడదు.

8. జయదేవమహాకవి రచించిన గీతాన్ని విన్న, చదివిన వారి హృదయాల్లో శ్రీకృష్ణుడు ప్రవేశించునుగాక.

## అష్టపది - 17

రాగం : ఆరభి　　　　తాళం : ఆది

### శ్లోకమ్

అథ కథ మపి యామినీం వినీయ
స్మరశర జర్ఝరితాపి సా ప్రభాతే ।

చ. 5. దళనపదం భవదధరగతంమమ
జనయతి చేతసి ఖేదమ్
కథయతి కథమధునాపి మయాసహ
తవ వపురేతదభేదమ్ ॥యాహి॥

చ. 6. బహి రివ మలినతరం తవ కృష్ణ
మనోపి భవిష్యతినూనమ్
కథ మథ వంచయసే జన మనుగత
మసమశర జ్వరదూనమ్ ॥యాహి॥

చ. 7. భ్రమతి భవానబలాకబళాయ
వనేషు కి మత్రవిచిత్రమ్
ప్రథయతి పూతనికైవ వధూవధ
నిర్దయ బాలచరిత్రమ్ ॥యాహి॥

చ. 8. శ్రీజయదేవభణిత రతివంచిత
ఖండిత యువతివిలాపమ్
శృణుత సుధామధురంవిబుధావిభు
ధాలయతో పిదురాపమ్ ॥యాహి॥

---

శ్లో॥ తదేదం పశ్యంత్యాః ప్రసరదనురాగం బహిరివ
ప్రియా పాదాలక్తచ్ఛురిత మరుణచ్ఛాయ హృదయమ్।
మమాద్య ప్రఖ్యాత ప్రణయభర భంగేనకి తవ
త్వదాలోకశ్శోకా దివ కిమపిలజ్జాం జనయతి॥
ప్రాతర్నీలనిచోళ మచ్యుతమురస్సంవీత పీతాంశుకమ్
రాధాయాశ్చకితం విలోక్యహసతి స్వైరం సఖీమండలే।
వ్రీడాచంచల మంచలం నయనయోరాధాయ రాధాననే
స్మేరస్మేర ముఖోయమస్తు జగదానందాయ నందాత్మజః॥

## పదహేడవ అష్టపది (భావప్రకాశిక)

[రాత్రి గడచిన తర్వాత మరునాడు ఉదయం తన యెదుట దోచిన శ్రీకృష్ణుని చూచి రాధ కోపంతో 'నీకిక్కడ ఏం పని? నాకన్నా గొప్ప సౌందర్యవతియై మేలైన సుఖాన్ని ఇచ్చే ఆ గోపిక దగ్గరకే వెళ్ళు' అని పలుకుతుంది.]

1. రాత్రి అంతా మేలుకుని క్రీడా విలాసంలో మునిగియుండడంచేత ఎర్రబడి మందమైన రెప్పపాటుతో అనురాగాన్ని వెల్లడించే కండ్లతో ఉన్న కృష్ణా! కపట వచనాలు చెప్పకు. నీ చింతలను పోగొట్టే సుందరాంగి వద్దకే పో.

2. కాటుక పెట్టుకున్న కండ్లను ముద్దాడడంవల్ల స్వభావంగా ఎఱ్ఱగా వుండే నీ పెదవి నీ శరీరకాంతికి తగ్గట్లే నల్లబడిపోయింది. పోపో, నీ ప్రియురాలి వద్దకే పో.

3. మరకతమణి శకలాలతో చేసిన పలకమీద బంగారు అక్షరాలతో రతిజయలేఖ వ్రాసినట్లుగా మన్మథయుద్ధంలో నీ శరీరంలో తగిలిన కాంతయొక్క నఖరేఖలు స్పష్టంగా కానవస్తున్నాయి. పోపో.

4. విశాలమైన నీ వక్షస్థలంలో నీ ప్రియురాలి పాదాలలోని లత్తుక రేఖలు ముద్రింపబడి మన్మథ వృక్షానికి గలిగిన చిగురాకుల్లా కానవస్తున్నాయి. పోపో.

5. నీ పెదవుల్లో గానవచ్చే నీ ప్రియురాలి దంతక్షతాలు నా మనస్సును ఎంతో బాధ పెడుతున్నాయి. నీకు నాకు భేదంలేదని ఇద్దరం ఒక్కటిగా కలిసియున్నామనే మాట, నీవనే మాట, ఎలా పొందుతుంది? పోపో.

6. నీ శరీరం ఎలా నీలవర్ణంతో ప్రకాశిస్తుందో అలా నీ మనస్సు కూడా కలుషితమై నల్లబడిపోయింది. మన్మథ బాణాలకు బాధపడేటట్లు నిన్నే నమ్మి అనుసరిస్తున్న నన్ను మోసపుచ్చి వంచించి పోయావుకదా! పోపో.

7. బృందావనంలోని ముగ్ధలనందర్నీ కబళించి వేయాలని తిరుగుతున్నావు. చిన్ననాడు దయలేక పూతనను నీవు వధించడమే నీ స్వభావాన్ని ప్రకటిస్తున్నది. పోపో.

8. ఖండితనాయికయైన రాధచేత రతివంచితనైతిననే చింతతో గావింపబడిన అమృత సమానములైన పలుకుల్ని జయదేవకవి గీతంగా రచించాడు. పొంద శక్యంగాని సుఖాన్ని కలిగించే శ్రీకృష్ణునికి సంబంధించిన ఈ గీతాన్ని విద్వాంసులు ఆలకించండి.

## అష్టపది - 18

రాగం : యదుకులకాంభోధి తాళం : ఆది

శ్లోకమ్

తా మథ మన్మథఖిన్నామ్
రతిరసభిన్నాం విషాదసంపన్నామ్।
అనుచింతిత హరి చరితామ్
కలహాంతరితా మువాచ రహసి సఖీ॥

చ. 1. హరి రభిసరతి వహతి మధుపవనే
కి మపర మధికసుఖం భవనే

ప. మాధవే మా కురు మానిని మానమయే ॥మాధవే॥

చ. 2. తాళఫలా దపి గురు మతిసరసమ్
కిము విఫలీకురుషే కుచకలశమ్ ॥మాధవే॥

చ. 3. కఠిన కథిత మిద మనుపద మచిరమ్
మా పరిహర హరి మతిశయరుచిరమ్ ॥మాధవే॥

చ. 4. కిమితి విషీదసి రోదిషి వికలా
విహసతి యువతిసభా తవ సకలా ॥మాధవే॥

చ. 5. మృదునళినీదళ శీతలశయనే
హరి మవలోకయ సఫలయ నయనే ॥మాధవే॥

చ. 6. జనయసి మనసి కి మితి గురుఖేదమ్
శృణు మమ వచన మనీహితభేదమ్ ॥మాధవే॥

చ. 7. హరి రుపయాతు వదతు బహు మధురమ్
కి మితి కరోషి హృదయ మతి విధురమ్ ॥మాధవే॥

చ. 8. శ్రీజయదేవభణిత మతిలలితమ్
సుఖయతు రసికజనం హరిచరితమ్ ॥మాధవే॥

---

శ్లో॥ స్నిగ్ధేయత్పరుషాసి యత్ప్రణమతి స్తబ్ధాసి యద్రాగిణి
ద్వేషంయాసి యదున్ముఖేవిముఖతాం యాతాసి తస్మిన్ప్రియే।
త ద్యుక్తం విపరీతకారిణి తవశ్రీఖణ్డచర్చావిషమ్
సీతాంశు స్తపనోహిమం హుతవహః క్రీడాముదోయాతనాః ॥

అంతర్మోహన మౌళిఘూర్ణన మిళన్మందార విస్రంసన
స్తబ్ధాకర్షణదృష్టి హర్షణ మహామన్త్రః కురంగీదృశామ్
దృప్యద్దానవ దూయమాన దివిషద్దుర్వార దుఃఖాపదామ్
భ్రంశః కంసరిపోస్సమర్పయతువః శ్రేయాంసి వంశీరవః ॥

## పద్దెనిమిదవ అష్టపది (భావప్రకాశిక)

[రాధ కోపించిన మాటలు విని కృష్ణుడు వెళ్ళి పోవును. తర్వాత రాధ "అయ్యో! ప్రేమతో సమీపించిన ప్రియుణ్ని పరుషోక్తులతో తరిమివేశాను. ఇంక మళ్ళీ వస్తాడా?" అని సంతాపం పొందుతుంది. చెలి 'రాధా! నీ కోపంవల్ల కృష్ణుడు వెళ్లాడు కదా, ఇక మళ్ళీ రాకపోతే నీ అందం, యౌవనం అంతా వ్యర్థమే కదా!' అంటుంది.]

1. చెలి రాధతో ఇలా అంటున్నది. శ్రీకృష్ణుడు వసంత ఋతువుల్లో చల్లగాలి వీస్తుండగా నీ పొందుగోరి వస్తున్నాడు. ఇంతకన్నా సుఖం ఏం కావాలి? ఓ రాధా! అభిమానంతో శ్రీకృష్ణుని యందు కోపం చూపకు.

2. తాటిపండ్లకన్నా గొప్పవైన స్తనాల సౌందర్యాన్ని సుఖానుభవం లేకుండా వ్యర్థం చేయకు.

3. మాటిమాటికి పరుషోక్తులతో ఇలా అతణ్ని తిరస్కరిస్తూ మాటాడకు. అత్యంత సుందరాంగుడైన శ్రీకృష్ణుని పొందుగోరి అనుసరించు.

4. రాధా! ఎందుకని దుఃఖిస్తున్నావు? కళలు హీనంకాగా ఎందుకు ఏడుస్తున్నావు? చెలులు నీ తెలివితక్కువ తనానికి నిన్ను చూచి నవ్వుతున్నారు.

5. మెత్తని తామరాకు పాన్పుమీద శ్రీహరిని కన్నుల పండువుగా చూడు. నీ కండ్లను సఫలం చేసుకో.

6. ఎందుకు మనస్సులో ఊరికే చింతపడుతున్నావు? నా హితోక్తులు విను.

7. శ్రీకృష్ణుడు రానీ, అతనితో ప్రియంగా మధురంగా మాట్లాడు. వ్యర్థంగా మనస్సును దుఃఖంతో చెదరనీకు.

8. శ్రీహరి విలాస లీలల్ని వర్ణిస్తున్న జయదేవకవి పలుకులు రసికజన హృదయాలకు సుఖం కలిగిస్తాయి.

## అష్టపది - 19

రాగం : ముఖారి　　　　తాళం : జంప

శ్లోకమ్

అత్రాంతరే మసృణరోష వశా దసీమ
నిశ్వాసనిస్సహముఖీం సుముఖీ ముపేత్య।
సవ్రీడ మీక్షితసఖీవదనాం దినాంతే
సానందగద్గదపదం హరి రి త్యువాచ॥

చ. 1. వదసి యది కించి దపి దంతరుచికౌముదీ
హరతు దరతిమిర మతిఘోరమ్
స్ఫురదధరశీధవే తవ వదనచంద్రమా
రోచయతు లోచనచకోరమ్

ప. ప్రియే! చారుశీలే! ప్రియే చారుశీలే!
ముంచ మయి మాన మనిదానమ్
సపది మదనానలో దహతి మమ మానసమ్
దేహి ముఖకమలమధుపానమ్　　॥ప్రియే॥

చ. 2 సత్య మే వాసియది సుదతి మయి కోపినీ
దేహి ఖరనఖరశరఘాతమ్

ఘటయ భుజబంధనం జనయ రదఖండనమ్
యేన వా భవతి సుఖజాతమ్ ॥ప్రియే॥

చ. 3. త్వమసిమమ భూషణం త్వమసిమమ జీవనమ్
త్వ మసి మమ భవజలధిరత్నమ్
భవతు భవతీహ మయి సతత మనురోధినీ
తత్ర మమ హృదయ మతియత్నమ్ ॥ప్రియే॥

చ. 4. నీలనళినాభ మపి తన్వి తవ లోచనమ్
ధారయతి కోకనదరూపమ్
కుసుమశరబాణభావేన యది రంజయసి
కృష్ణ మిద మేత దనురూపమ్ ॥ప్రియే॥

చ. 5. స్ఫురతుకుచకుంభయో రుపరిమణిమంజరీ
రంజయతు తవ హృదయదేశమ్
రసతు రశనాపి తవ ఘనజఘనమండలే
ఘోషయతు మన్మథనిదేశమ్ ॥ప్రియే॥

చ. 6. స్థలకమలభంజనం మమహృదయరంజనమ్
జనిత రతిరంగపరభాగమ్
భణ మసృణవాణి కరవాణి చరణద్వయమ్
సరస సదలక్తక సరాగమ్ ॥ప్రియే॥

చ. 7. స్మరగరళఖండనం మమశిరసిమండనమ్
దేహి పదపల్లవ ముదారమ్
* జ్వలతి మయి దారుణో మదనకదనానలో
హరతు తదుపాహిత వికారమ్ ॥ప్రియే॥

---

* ఈ ఏడవ చరణములో సగముపై భగవంతునిచేతనే వ్రాయబడినది కావున ఈ సందర్భమున దేవునికి కర్పూరహారతి చూపుట వాడుక.

చ. 8. ఇతి చటులచాటుపటుచారు మురవైరిణో
రాధికా మధి వచనజాతమ్
జయతు జయదేవకవిభారతీభూషితమ్
మానినీజనజనితశాతమ్ ॥ప్రియే॥

---

శ్లో॥ పరిహార కృతాశఙ్కే శంకాం త్వయా సతతం ఘన
స్తన జఘనయాక్రాన్తే స్వాన్తే పరానవకాశిని।
విశతి వితనో రన్యో ధన్యోనకోపి మమాన్తరమ్
స్తనభర పరీరంభారంభే విధేహి విధేయతామ్॥
వ్యథయతి వృథామౌనం తన్వి ప్రపంచయ పంచమమ్
తరుణిమధురాలాపైః తాపం వినోదయ దృష్టిభిః।
సుముఖి విముఖీభావం తావద్విముంచ న ముంచమామ్
స్వయమతిశయస్నిగ్ధో ముగ్ధేప్రియోయ ముపస్థితః॥
ముగ్ధే విధేహి మయి నిర్దయ దన్తదంశమ్
దోర్వల్లి బంధనిబిడస్తన పీడనాని
చండిత్వ మేవ ముదముంచ న పంచబాణ
చండాశ కాండదశనా దసవః ప్రయాన్తు॥
బంధూక ద్యుతి బాంధవోయమధరః స్నిగ్ధో మధూకచ్ఛవిః
గండచ్చండి చకాస్తి నీలనలిన శ్రీమోచనం లోచనమ్।
నాసాన్వేతి తిలప్రసూనపదవీం కుందాభదన్తిప్రియే
ప్రాయస్త్వన్ముఖసేవయా విజయతే విశ్వం సపుష్పాయుధః॥
దృశౌ తవమదాలసే వదన మిందు మత్యుజ్జ్వలమ్
గతిర్జన మనోరమా విధుత రుమ్భ మూరుద్వయమ్
రతిస్తవకలావతీ రుచిర చిత్రలేఖే భ్రువౌ
అహో విబుధ యౌవనం వహసి తన్వి పృథ్వీంగతా॥

ప్రతిం వస్తునుతాం హరిః కువలయాపీడేన సార్ధం రణే
రాధాపీన పయోధర స్మరణకృ త్కుంభేన సంపేతవా
యత్ర స్విద్యతి మీలతిక్షణమథ క్షిప్తేద్విపే తత్క్షణాత్
కంస స్యాలమభూజ్జితం జితమితి వ్యామోహ కోలాహలః॥

## పందొమ్మిదవ అష్టపది (భావప్రకాశిక)

[పగలంతా రాక రాత్రి శ్రీకృష్ణుడు రాధ దగ్గరికి వస్తాడు. విరహంలో ముంచాడన్న బాధ, కృష్ణుణ్ణి చూడగానే మనస్సులో పొంగిన సంతోషం ఈ రెండూ రాధను కలవరపెడతాయి. అంతలో శ్రీకృష్ణుడు తన తప్పు మన్నించి ఏలుకొమ్మని రాధను వేడుకుంటాడు. ఈ అష్టపదిలో ఏడవచరణం వ్రాసేటప్పుడు జయదేవకవి మనస్సులో 'రాధా! లేత చిగురాకువంటి నీ పాదాన్ని నా తలపై పెట్టు. గరుడ మంత్రానికి విషం దిగినట్లు నా తాపం తీరుతుంది' అన్న భావం స్ఫురిస్తుంది. అంతలో జగన్నాయకుని గురించి ఇలా వ్రాయడం యుక్తం కాదని చింతపడి స్నానానికి వెళ్ళాడు. అంతలో జయదేవకవి వేషంలో శ్రీకృష్ణుడు వచ్చి జయదేవకవికి స్ఫురించిన భావాన్నే చరణంలో ఇమిడ్చి వ్రాసి మరుగైపోయాడు. స్నానానంతరం వచ్చి చూచిన జయదేవుడు తనభార్య పద్మావతివల్ల జరిగింది విని దేవుని లీలయని గుర్తించి తన భార్యకు భగవద్దర్శనం లభించినందుకు ఎంతో పొంగిపోయి ఈ గీతం కడపటలో పద్మావతికి

భర్తయగు జయదేవుడు అని వ్రాశాడు. కాబట్టి ఈ గీతంలోని ఏడవచరణం చాల మహత్వం కలది.]

శ్రీకృష్ణుడు రాధతో ఇట్లనుచున్నాడు.

రాధా! ఏదైనా మాట్లాడు. నీ పలువరుస కాంతులనే వెన్నెలలు మిక్కిలి నీవలని భయమనే ఘోరమై ఉన్న చీకటిని పోగొట్టగలదు.

మెరుస్తున్న నీ పెదవిలోని అమృతంతో కూడిన నీ ముఖమనే చంద్రబింబం నా కన్నులనే చకోరాలకు రుచిని కలిగింపనీయవే.

1. మనోహరమైన శీలంకలదానా! రాధా! నా మీదగల కోపం విడువు. ఈ కోపానికి కారణంలేదు. మన్మథాగ్ని నా మనస్సును దహించి వేస్తున్నది. నీ ముఖకమలంలోని తేనెను ఆస్వాదింపనీయవే.

2. నిజంగా నామీద కోపం కలిగిందా, వాడి గోళ్ళతో నఖక్షతాల్ని చేయి. నీ బాహువులతో నన్ను కట్టివేయి. దంతక్షతాలు చేసి నీ కోపం తీర్చుకో. అప్పటికైనా నీకు సుఖం కలగనీ.

3. రాధా! నీవే నా ప్రాణం నీవే నాకు సొమ్ము. ఈ సంసారమనే సముద్రంలో నాకు దొరికిన అమూల్యరత్నం నీవే. నీవు నన్నెప్పుడూ అనుసరించి ఉండు. దాన్ని పొందాలనే నా మనస్సు ఎప్పుడూ ప్రయత్నిస్తున్నది.

4. నల్లకలువల్లా ఉండే నీ కండ్లిప్పుడు కోపంవల్ల ఎఱ్ఱకలువల్లా ఉన్నాయి. ఈ చూపుల్ని మన్మథబాణాలుగా అనురాగంతో నన్ను రంజింపజేశావా, నీలవర్ణంగల కృష్ణుణ్ణైన నాకు తగినట్లుంటుంది.

5. రాధా! నీ కుచ కలశాలమీద రత్నహారాలు అందం గులుకుతూ నీ హృదయాన్ని సంతోషపెట్టుతూ ప్రకాశింపనీ. నీ నడుములో ఒడ్డాణము మన్మథుని ఆజ్ఞను తెలుపుతున్నట్లు శబ్దింపనీ.

6. మృదుభాషలుకల రాధా! మెట్ట దామరల అందాన్ని తిరస్కరిస్తూ నా మనస్సును సంతోషపెట్టుతూ క్రీడాంతంలో విలాసాన్ని సూచించే నీ పాదాలలో సరసములైన లత్తుక రేఖలను నన్ను చిత్రింపనీ.

7. మన్మథవిషం నా తలకెక్కింది. నా శిరస్సుకు అలంకారంగా నీ చరణ పద్మాన్ని ఉంచు. దారుణంగా నన్ను కలవర పెడుతున్న మన్మథతాపం చల్లారనీ.

8. మురవైరి అగు శ్రీకృష్ణుడు నేర్పుతో మనోహర వాక్యాలతో రాధను ఆశ్వాస పరిచిన విధాన్ని పద్మావతికి వల్లభుడైన జయదేవకవి ఇలా వర్ణించాడు. ఈ గీతం గొప్పదిగా వెలసి యుండునుగాక.

## అష్టపది - 20

రాగం : కళ్యాణి తాళం : చాపు

### శ్లోకమ్

సుచిర మనునయేన ప్రీణయిత్వా మృగాక్షీం
గతవతి కృతవేషే కేశవే కుంజశయ్యాం।
రచితరుచిరభూషాం దృష్టిమోషే ప్రదోషే
స్ఫురతి నిరవసాదాం కాపి రాధాం జగాద॥

చ. 1. విరచితచాటు వచనరచనం
చరణే రచిత ప్రణిపాతం
సంప్రతిమంజుల వంజుళసీమని
కేళిశయన మనుయాతం

ప. ముగ్ధే! మధుమథనమ్
హే రాధే ముగ్ధే మధుమథనమ్
అనుగత మనుసర రాధే ॥ముగ్ధే॥

చ. 2. ఘనజఘన స్తనభారభరేదర
మంథర చరణవిహారమ్
ముఖరితమణిమంజీర ముపేహి
విధేహి మరాళ నికారమ్ ॥ముగ్ధే॥

చ. 3. శృణు రమణీయతరం తరుణీజన
మోహన మధురిపురావమ్
కుసుమశరాసన శాసనవందిని
పికనికరే భజ భావమ్ ॥ముగ్ధే॥

చ. 4. అనిలతరళ కిసలయనికరేణ
కరేణ లతానికురుంబమ్
ప్రేరణ మివ కరభోరు కరోతిగతిమ్
ప్రతి ముంచ విళంబమ్ ॥ముగ్ధే॥

చ. 5. స్ఫురిత మనంగతరంగవశాదివ
సూచితహరిపరిరంభమ్
పృచ్ఛమనోహరహార విమలజల
ధారమముం కుచకుంభమ్ ॥ముగ్ధే॥

చ. 6. అధిగత మఖిలసఖీభి రిదంతవ
వపు రపి రతిరణసజ్జమ్
చండి రణితరశనారవడిండిమ
మభిరస సరస మలజ్జమ్ ॥ముగ్ధే॥

చ. 7. స్మరశరసుభగనఖేన సఖీమవ
లంబ్య కరేణ సలీలమ్
చల వలయక్వణితై రవబోధయ
హరి మరినిగదితశీలమ్ ॥ముగ్ధే॥

చ. 8. శ్రీజయదేవభణిత మధరీకృత
హారముదాసిత వామమ్
హరివినిహితమనసా మధితిష్ఠతు
కంఠతటీ మవిరామమ్ ॥ముగ్ధే॥

---

శ్లో॥ అక్ష్ణోర్నిక్షిప దంజనం శ్రవణయోః తాపిఞ్ఛ గుంజావళిం
మూర్ధ్ని శ్యామ సరోజదామ కుచయోః కస్తూరికా పత్రకమ్।
ధూర్తానా మభిసార సాహసకృతాం విష్వజ్నికుంజే సఖి
ధ్వాన్తంనీలనిచోల చారు సుదృశాం ప్రత్యంగ మాలింగతి॥

కాశ్మీరగౌరవపుషామభిసారికాణా
మాబద్ధరేఖ మభితో రుచిమంజరీభిః।
ఏతత్తమాలదల నీల తమం తమిస్రం
తత్ప్రేమ హేమనికషోపలతాం తనోతి॥

## ఇరువదవ అష్టపది (భావప్రకాశిక)

[శ్రీకృష్ణుని ఓదార్పులవల్ల రాధకోపం తీరింది. ఒకచెలి శ్రీకృష్ణుని గుణాలు పొగడగా విన్న రాధ మనస్సులో ప్రేమ ఉప్పొంగగా శ్రీకృష్ణుని పొందు గోరి తన్ను అలంకరించుకుంటుంది.]

చెలి శ్రీకృష్ణునందు సుముఖంతో ఉన్న రాధతో ఇట్లను చున్నది.

1. ముద్దరాలా! రాధా! ప్రియవాక్యాలతో నీ పాదాలకు నమస్కరించి ఇప్పుడు ప్రబ్బలిచెట్ల సమీపంలో ఉన్న పొదరింటిలో క్రీడాశయ్యను పొంది ఉన్న శ్రీకృష్ణుణ్ణి నిన్ను శరణు పొందినవాణ్ణి అనుసరించు.

2. గొప్ప పిరుదులు స్తనాలు కలిగి ఉన్నందున మెల్లగా నీ నడకలతో, రత్నాలు పొదిగిన అందెలు శబ్దిస్తుండగా హంసవలె ఒప్పు అడుగులతో కృష్ణునొద్దకు వెళ్ళు.

3. స్త్రీలను మోహింపజేస్తూ శ్రావ్యంగా గానం చేస్తున్న తుమ్మెదల శబ్దాన్ని విను. మన్మథుని ఆజ్ఞతో వందిజనంలా పొగడుతూ ఉన్న కోకిలలయెడ ఆదరం చూపు.

4. లతలు గాలికి కదలుచున్న చిగురాకులనే చేతులతో నిన్ను ప్రేరేపిస్తున్నది. ఆలస్యంచేయక శ్రీకృష్ణుని అనుసరించు. వెళ్ళు.

5. మన్మథతరంగాలచేత కదలింపబడినట్లు కదలుతూ మనో హర హారాలనే జలధారలతో కూడిన కుచకుంభాలను శ్రీహరి పరి రంభాన్ని సూచిస్తూ వున్నాయి, అడిగి చూడు.

6. సఖులచేత నీ ఈ సుందర శరీరం మన్మథ యుద్ధానికి తగినట్లు అలంకరింపబడింది. కోపం కలదానా! మొలనూలు డిండిమ వాద్యంవలె మోగుతుండగా సిగ్గువదలి శ్రీకృష్ణుని చేరుకో.

7. మన్మథబాణంలా అందము గులుకుతున్న గోళ్ళతో కూడిన చేతితో లీలగా సఖిని ఆధారంగా పట్టుకుని చేతుల్లో కదలు

చున్న గాజుల శబ్దంతో నీ రాకను శ్రీహరికి ఎరుకపరుస్తూ అతని సమీపానికి చేరుకో.

8. ముత్యాలను తిరస్కరిస్తూ ముత్యాలు గూర్చినట్లుగా వంకరలేని వక్రోక్తులు లేక జయదేవకవి హృదయంగమంగా రచించిన ఈ గీతం శ్రీహరియందు మనసుంచినవారి కంఠంలో ఎల్లప్పుడు ఉండునుగాక. హరి భక్తులు నిరంతరం దీన్ని గానం చేయుదురు గాక....

## అష్టపది - 21

రాగం : కానడా తాళం : జంప

శ్లోకం

హారావళీతరళ కాంచనకాంచిదామ
మంజీరకంకణ మణిద్యుతిదీపితస్య।
ద్వారే నికుంజనిలయస్య హరిం నిరీక్ష్య
వ్రీడావతీ మథ సఖీ మియ మిత్యువాచ॥

చ. 1. మంజుతరకుంజతల కేళిసదనే
ఇహ విలస రతిరభసహసితవదనే

ప. ప్రవిశ రాధే! మాధవసమీప మిహ ॥ప్రవిశ॥

చ. 2. నవభవ దశోకదళ శయనసారే
ఇహ విలస కుచకలశతరళహారే ॥ప్రవిశ॥

చ. 3. చలమలయ వనపవనసురభిశీతే
ఇహ విలస రసవలిత లలితగీతే ॥ప్రవిశ॥

చ. 4. కుసుమచయ రచితశుచివాసగేహే
ఇహ విలస కుసుమసుకుమార దేహే ||ప్రవిశ||

చ. 5. మధు తరళపికనికరనినదముఖరే
ఇహ విలస దశనరుచిరుచిరశిఖరే ||ప్రవిశ||

చ. 6. వితత బహువల్లినవపల్లవఘనే
ఇహ విలస పీనకుచకుంభజఘనే ||ప్రవిశ||

చ. 7. మధుముదిత మధుపకులకలితరావే
ఇహ విలస కుసుమశరసరసభావే ||ప్రవిశ||

చ. 8. విహిత పద్మావతీ సుఖసమాజే
భణతి జయదేవకవిరాజరాజే ||ప్రవిశ||

---

శ్లో|| త్వాం చిత్తేనచిరం వహన్నయ మతిశ్రాన్తో భృశంతాపితః
కన్దర్పేణచ పాతుమిచ్ఛతిసుధా సంపాతబింబాధరమ్।
అస్యాంగం తదలంకురు క్షణమిహ భ్రూక్షేప లక్ష్మీలవ
క్రీతేదాస ఇవోపసేవిత పదాంభోజే కుతస్సంభ్రమః||

ఇరవై ఒకటవ అష్టపది (భావప్రకాశిక)

[రాధ శ్రీకృష్ణుడున్న పొదరింటిని సమీపించి సిగ్గుతో అడుగులు తడబడ వున్నప్పుడు చెలులు ఆమెను ఉత్సాహపరుస్తూ శ్రీకృష్ణుని చేరబొమ్మని ప్రోత్సహిస్తున్నారు.]

1. రాధా! క్రీడాకుతుహూలంవల్ల కలిగిన చిరునవ్వు ముఖమందు చిందులాడగా రమణీయంగా ఉన్న పొదరిల్లనే క్రీడా గృహంలో కృష్ణుని చేరుకో. పో. మురారీ! మీకు మంగళశతాలు కలుగుగాక.

2. కుచకలశాలమీద పొరలాడుచున్న హారాలతో కొత్తవైన అశోకపు చిగుళ్ళతో నైన పాన్పుమీద శ్రీకృష్ణునితో క్రీడించు.

3. రసమనోహర గీతాలు ఆలాపించు రాధా! మంద మారుతం చల్లగా వీచుచుండగా సువాసనతో కూడి వున్న ఈ పొదరింటిలో శ్రీకృష్ణునితో క్రీడించు.

4. పుప్వులవలె సుకుమారమైన శరీరం కల రాధా! పువ్వులతో కూడి పరిశుద్ధమై వున్న ఈ లతా గృహంలో శ్రీకృష్ణునితో క్రీడించు.

5. దంతకాంతులతో ఒప్పుచున్న రాధా! వసంతంలో కోకిలలు మనోహరంగా కూస్తూ వున్న ఈ పొదరింటిలో శ్రీకృష్ణునితో క్రీడించు.

6. బలిసిన కుంభాల్లా వున్న స్తనాలు, జఘనం కల రాధా! కొత్త చిగురాకులు తొడిగిన లతలు బలిసిఉన్న ఈ పొదరింటిలో శ్రీకృష్ణునితో క్రీడించు.

7. మన్మథబాణాలచే కలవరపెట్టబడిన మనస్సుకల రాధా! పూదేనెలు తాగి మత్తిల్లిన తుమ్మెదలు రొదచేస్తూ ఉన్న ఈ పొదరింటిలో శ్రీకృష్ణునితో క్రీడించు.

8. పద్మావతితోకూడి సుఖిస్తున్న జయదేవకవి గానం చేస్తూ వుండగా శ్రీకృష్ణుని సమీపించి క్రీడించు.

## అష్టపది - 22

రాగం : మధ్యమావతి తాళం : ఆది

శ్లోకమ్

సా ససాధ్వససానందం గోవిందే లోలలోచనా ।
శింజానమంజుమంజీరం ప్రవివేశ నివేశనమ్ ॥

చ. 1. రాధావదన విలోకన వికసిత
వివిధవికారవిభంగమ్
జలనిధి మివ విధుమండలదర్శన
తరళితతుంగ తరంగమ్

ప. హరిం ఏకరసం చిరమ్
అభిలషిత విలాసమ్
సా దదర్శ గురుహర్ష వశంవద
వదన మనంగవికాసమ్ ॥హరి॥

చ. 2. హార మమలతరతార మురసిదధ
తం పరిరభ్య విదూరమ్
స్ఫుటతర ఫేనకదంబకరంబిత
మివ యమునాజలపూరమ్ ॥హరి॥

చ. 3. శ్యామలమృదుల కళేబరమండల
మధిగత గౌరదుకూలమ్
నీలనళిన మివ పీతపరాగ
పటలభరవలయిత మూలమ్ ॥హరి॥

చ. 4. తరళదృగంచల చలనమనోహర
వదనజనిత రతిరాగం
స్ఫుటకమలోదర ఖేలితఖంజన
యుగ మివ శరది తటాకమ్ ॥హరి॥

చ. 5. వదనకమల పరిశీలన మిళిత
మిహిరసమ కుండలశోభమ్
స్మితరుచి రుచిరసముల్లసితాధర
పల్లవకృత రతిలోభమ్ ॥హరి॥

చ. 6. శశికిరణచ్ఛురితోదర జలధర
సుందర కుసుమసుకేశమ్
తిమిరోదిత విధుమండల నిర్మల
మలయజ తిలకనివేశమ్ ॥హరి॥

చ. 7. విపులపులక భరదంతురితం రతి
కేళికలాభి రధీరమ్
మణిగణకిరణ సమూహసముజ్జ్వల
భూషణ సుభగశరీరమ్ ॥హరి॥

చ. 8. శ్రీజయదేవభణిత విభవద్విగు
ణీకృత భూషణభారమ్
ప్రణమత హృదివివిధాయ హరింరుచి
రంసుకృతో దయసారమ్ ॥హరి॥

శ్లో॥ అతిక్రమ్యాపాంగం శ్రవణపద పర్యన్తగమన
ప్రయాసేనేవాక్షో తరలతమభావం గమితయోః।
ఇదానీంరాధా యాః ప్రియతమ సమాలోకసమయే
పపాత స్వేదాంబు ప్రసరఇవ హర్షాశ్రునికరః॥

భజన్త్యాః తల్పాన్తం కృతకపట కండూతివిహిత
స్మితే యాతే గేహాత్ బహిరపి హితాళీ పరిజనే।
ప్రియాస్యం పశ్యన్త్యాః స్మరశర సమాకూతసుభగమ్
సలజ్జా లజ్జాభిః వ్యగమదివ దూరం మృగదృశః॥

జయశ్రీవిన్యస్తైః మహితఇవ మన్దారకుసుమైః
స్వయం సిన్దూరేణ ద్విపరణముదా ముద్రిత ఇవ।
భుజాపీడ క్రీడా హత కువలయా పీడహారిణః
ప్రకీర్ణా సృగ్బిందుర్జయతి భుజదండో మురజితః॥

## ఇరవై రెండవ అష్టపది (భావప్రకాశిక)

[చెలికత్తెలు ఉత్సాహపరచగా సిగ్గువదలి రాధ కండ్లార శ్రీృకష్ణుని చూచి అతనియందే లగ్నమైన మనస్సుతో శ్రీకృష్ణుని చేరుకుంటుంది. ఏదో నెపం పెట్టి చెలులందరు వెళ్ళిపోతారు.]

1. రాధ తన ముఖాన్ని చూడడంవల్ల మనస్సులో వికసించిన పలువిధాలైన మన్మథ క్రీడోత్సాహాలు కల శ్రీకృష్ణుని. చంద్ర మండలాన్ని చూచినందువల్ల ఉప్పొంగిన అలలతోడి సముద్రంలా చూచింది. చాలకాలంనుండి కోరుతున్న క్రీడాభిలాషతో ఉప్పొంగిన

భావాన్ని ప్రకటించే ముఖవిలాసంతో కూడిన శ్రీకృష్ణుణ్ని రాధ చూచింది.

2. చాలా స్వచ్ఛంగా వున్న నాయకమణితో కూడిన దీర్ఘమైన ముక్తాహారాన్ని వక్షస్థలంలో చేర్చుకుని నురుగులతో కూడి పొంగుచున్న అలలుకల యమునానదివలె ఒప్పుయున్న శ్రీకృష్ణుణ్ని రాధ చూచింది.

3. పచ్చని పుప్పొళ్ళు కమ్మిన మొదలుగల నల్లకలువలా సుకుమారమైన తన నీలవర్ణపు శరరంమీద పచ్చని బంగారు వలువ కప్పుకుని ఉన్న శ్రీకృష్ణుని రాధ చూచింది.

4. చంచలములైన కడగండ్ల చూపులతో క్రీడలో అనురాగాన్ని ప్రకటిస్తూ వున్న సుందరమైన ముఖం కలిగి శరత్కాలంలో పద్మవనం మధ్య క్రీడిస్తున్న కాటుకపిట్టల జంటతో గూడిన నిర్మల తటాకంలా వున్న శ్రీకృష్ణుని రాధ చూచింది.

5. ముఖకమలమనే అలంకారంతో కూడి ప్రకాశిస్తున్న సూర్యునిలా ఒప్పుచున్న కుండలాల కాంతితో చిరునవ్వులు ప్రకటించే అధరపల్లవాలచే రతిక్రీడాభిలాషను వెల్లడిస్తున్న శ్రీకృష్ణుణ్ని రాధ చూచింది.

6. చంద్రకిరణాలతో చుట్టుకోబడిన మేఘంలా మంచి పుష్పాలతో చుట్టబడిన కేశపాశమూ, చీకటిమధ్య ఉదయించిన చంద్రబింబంలా ముద్దులు గురుస్తున్న స్వచ్ఛమయిన శ్రీగంధపు బొట్టూ కల శ్రీకృష్ణస్వామిని రాధ చూచింది.

7. విస్తారంగా కలిగిన పులకాంకురాలతో ఇంచుకంత మిట్టపల్లాలుగా కనబడుతూ క్రీడావిలాసాల్లో ధైర్యం చాలనివాడై

మణిభూషణాలతో ఒప్పుచున్న శరీరంకల శ్రీకృష్ణుని రాధ చూచింది.

8. శ్రీ జయదేవకవి వాక్కులచే ఇనుమడింపబడిన అలంకారాలతో ఒప్పుచున్న పుణ్యసారమైన శ్రీకృష్ణుణ్ణి. ఈ గీతాన్ని విన్న చదివిన రసికులు చిరకాలం మనస్సులో ఉంచుకుని నమస్కరించండి.

## అష్టపది - 23

రాగం : నాదనామక్రియ తాళం : ఆది

### శ్లోకమ్

గతవతి సఖీబృందే మందత్రపాభరనిర్భర
స్మరపరవశాకూతస్ఫీతస్మితస్నపితాధరాం।
సరసమనసం దృష్ట్వా హృష్టాం ముహూ ర్నవపల్లవ
ప్రసవశయనే నిక్షిప్తాక్షీ మువాచ హరిః ప్రియాం॥

చ. 1. కిసలయశయనతలే కురు కామిని!
చరణ నళిన వినివేశమ్
తవ పదపల్లవ వైరిపరాభవ
మిద మనుభవతు సువేశమ్

ప. క్షణ మధునా నారాయణమ్
అనుగత మనుసర రాధే ॥క్షణ॥

చ. 2. కరకమలేన కరోమి చరణమహ
మాగమితాసివిదూరమ్
క్షణముపకురుశయనోపరి మామివ
నూపుర మనుగతి శూరమ్ ॥క్షణ॥

చ. 3. వదన సుధానిగళిత మమృతమివ
రచయ వచనమనుకూలమ్
విరహమివాపనయామి పయోధర
రోధక మురసిదుకూలమ్ ॥క్షణ॥

చ. 4. ప్రియ పరిరంభణ రభసవలిత మవ
పులకిత మతిదురవాపమ్
మధురసి కుచకలశం వినివేశయ
శోషయ మనసిజతాపమ్ ॥క్షణ॥

చ. 5. అధరసుధారస ముపనయభామిని!
జీవయమృత మివదాసమ్
త్వయి వినిహితమనసం విరహానల
దగ్ధవపుషమవిలాసమ్ ॥క్షణ॥

చ. 6. శశిముఖి! ముఖరయమణిరశనాగుణ
మనుగుణకంఠ నినాదమ్
శ్రుతియుగళే పికరుతవికలే మమ
శమయ చిరాదవసాదమ్ ॥క్షణ॥

చ. 7. మా మతివిఫలరుషా వికలీకృత
మవలోకితు మధునేదమ్
మీలతి లజ్జితమివ నయనం తవ
విరమ విసృజ రతిఖేదమ్ ॥క్షణ॥

చ. 8. శ్రీజయదేవభణిత మిదమను పద
నిగదిత మధురిపుమోదమ్
జనయతు రసికనేషు మనోరమ
రతిరసభావవినోదమ్ ॥క్షణ॥

శ్లో॥ ప్రత్యూహః పులకాఙ్కురేణ నిబిడాశ్లేషే నిమేషేణచ
క్రీడాకూత విలోకనే ఽధరసుధా పానే కథానర్మభిః।
ఆనందాశ్రుగమేన మన్మథకలా యుద్ధేపి యస్మిన్నభూత్
ఉద్భూతస్స తయోర్బభూవ సురతారంభః ప్రియంభావుకః॥

దోర్భ్యాం సంయమితః పయోధర భరేణాపీడితః పాణిజై
రావిద్ధోదశనైః క్షతాధరపుటః శ్రోణీ తటేనాహతః।
హస్తేనానమితః కచేఽధరసుధా స్వాదేన సమ్మోహితః
కాన్తఃకామపి తృప్తిమాప తదహో కామస్యవామాగతిః॥

మారాంకే రతికేళిసంకుల రణారమ్భే తయాసాహస
ప్రాయం కాన్తజయాయ కిఞ్చిదుపరి ప్రారంభియత్సంభ్రమాత్।
నిష్పందా జఘనస్థలీ శిథిలితా దోర్వల్లిరుత్కమ్పితం
వక్షోమీలిత మక్షి పౌరుషరసః స్త్రీణాం కుతస్సిద్ధ్యతి॥

తస్యాఃపాటల పాణిజాంకితమురోనిద్రా కషాయేదృశౌ
నిర్ధూతోధరశోణిమా విలులిత స్స్రస్తస్స్రజో మూర్ధజాః।
కాంచీదామ దరశ్లథాం చలమితి ప్రాతర్నిగాఢైర్దృశో
రేభిః కామశరైః తదద్భుతమభూత్ పత్యుర్మనః కీలితమ్॥

ఇరవై మూడవ అష్టపది (భావప్రకాశిక)

[రాధాకృష్ణుల క్రీడావిలాసములు వర్ణింపబడు చున్నవి. తన్ను సమీపించిన రాధనుచూచి ప్రేమోత్సాహంతో క్రీడాకుతూహలం మనస్సులో ఉప్పొంగగా శ్రీకృష్ణుడు ఇట్లనుచున్నాడు]

1. రాధా! చిగుళ్ళవంటి నీ పాదాలతో వైరం పెట్టుకున్న ఈ చిగురాకు పాన్పు పరాభవం పొందేటట్లు దీనిమీద నీ పాద పద్మాలను ఉంచు.

రాధా, ఇప్పుడు అనుకూలుడైన నారాయణుని సేవించు. ఇది చెలులు చెప్పినమాట.

2. రాధా! చాలాదూరం శ్రమపడి నడిచివచ్చావు. నీ పాదా లను పొంది ఉన్న అందెలవలె నా కరకమలాన్ని నీ పాదాలమీద ఉంచి మెల్లగా ఒత్తేటందుకు అంగీకరించు.

3. ముఖచంద్రుని నుండి జారుచున్న అమృతంలా అను కూలమైన మాటలు పలుకు నీ ఎదను కప్పిఉన్న దుకూలాన్ని వియోగాన్ని పోగొట్టిన విధంగా తొలగిస్తాను.

4. రాధా! కౌగిలించుటతో వేగాన్ని పురికొల్పుతూ పులకించి పొంద శక్యంకాని కుచకలశాలని నా వక్షస్థలంలో ఉంచు, మన్మథ తాపాన్ని పోగొట్టు.

5. నీయందే మనస్సు ఉంచి విరహానలంవల్ల దగ్ధమైనట్లున్న శరీరం కల నన్ను విలాసరహితుణ్ణి నీ దాసుణ్ణి మృతునివలె ఉన్న వాణ్ణి అధరామృతమిచ్చి బ్రతికించు.

6. కోకిల కూతలువిని వికలములై ఉన్న నా చెవులకు విందు కూర్చుస్తూ మొరయుచున్న మొలనూలి మణుల శబ్దానికి అనుగుణంగా మృదుల కంఠధ్వనులను వినిపించు.

7. కోపంతో విఫలీకృతుణ్ని గావించి ఇప్పుడు అనురాగంతో చూస్తున్న నీ కండ్లు సిగ్గుతో మూసుకున్నట్లున్నవి. దుఃఖము పోయినట్లుగానే ఈ నునుసిగ్గును గూడా వదలి కండ్లు తెరు.

8. పదపదంలో శ్రీకృష్ణుని సంతోషాన్ని వెల్లడిస్తూ జయదేవకవి రచించిన ఈ గీతం రసికజనుల హృదయాల్లో భక్తి రూప శృంగార వినోదాన్ని కలిగించగలదు.

## అష్టపది - 24

రాగం : మంగళకౌశికం తాళం : చాపు

శ్లోకమ్

అధకాంతం రతిశ్రాంతం అభిమండన వాంఛయా ।
జగాదమాధవం రాధాముగ్ధా స్వాధీన భర్తృకా ॥

చ. 1. కురుయదునందన! చందన శిశిరత
రేణక రేణపయోధరే
మృగమద పత్రకమత్రమనోభవ
మంగళకలశ సహోదరే

ప. నిజగాద సా యదునందనే
క్రీడతి హృదయానందనే
నందనందనే భక్త చందనే ॥నిజ॥

చ. 2. అళికుల భంజనమంజనకంరతి
నాయకసాయక మోచనే
త్వదధర చుంబనలంబితకజ్జల
ముజ్జ్వలయప్రియ లోచనే ॥నిజ॥

చ. 3. నయనకురంగతరంగవికాస
నిరాసకరే శ్రుతిమండలే
మనసిజ పాశవిలాసధరే సుభ
గేవి నివేశయ కుండలే ॥నిజ॥

చ. 4. భ్రమరచయం రచయంత ముపరిరుచి
రంసుచిరంమమ సమ్ముఖే
జితకమలే విమలే పరికర్మయ
నర్మజనక మలకం ముఖే ॥నిజ॥

చ. 5. మృగమదరసవలితం లలితంకురు
తిలక మళికరజనీకరే
విహితకళంగళం కమలానన
విశ్రమిత శ్రమశీకరే ॥నిజ॥

చ. 6. మమరుచిరేచికురే కురుమానద
మానసజధ్వజ చామరే
రతిగలితే లలితే కుసుమాని
శిఖండి శిఖండకడామరే ॥నిజ॥

చ. 7. సరసఘనే జఘనేమమ శంబర
దారణవారణ కంధరే
మణిరశనా వసనాభరణాని
శుభాశయవాసయ సుందరే ॥నిజ॥

చ. 8. శ్రీజయదేవ సుకవివచనే హృద
యంసదయం కురుమండనే
హరి చరణ స్మరణామృత నిర్మిత
కలికలు షజ్వర ఖండనే ॥నిజ॥

---

శ్లో॥ రచయ కుచయోశ్చిత్రం కురుష్వకపోలయో
ర్ఘటయ జఘనే కాంచీస్రజం కబరీ భరే।
కలయ వలయశ్రేణీం పాణౌపదేకురు నూపు
రితినిగదితః ప్రీతః పీతాంబరోపితథా కరోత్॥

యద్గాంధర్వ కళాసుకౌశలమనుధ్యాతంచ యద్వైష్ణవమ్
యచ్ఛృంగార వివేకతత్త్వమపియ త్కావ్యేషు లీలాయుతమ్।
తత్సర్వం జయదేవపండితకవేః కృష్ణైకదాసాత్మన
స్సానందాః పరిశోధయన్తు సుధియ శ్శ్రీగీతగోవిన్దతః

## ఇరవై నాల్గవ అష్టపది (భావప్రకాశిక)

[శ్రీకృష్ణునితో క్రీడావిలాసంలో ఉప్పొంగిన మనస్సుతో రాధ అతనితో ఇట్లనుచున్నది.]

1. తన హృదయానికి అమితానందం కూర్చిన భక్తచంద ఘని నందనందనుణ్ని చూచి రాధ ఇలా అంటున్నది.

కృష్ణా శ్రీగంధంలా చల్లగా ఉన్న నీ చేతులతో మన్మథునికి మంగళార్థం ఉంచబడిన కలశాల్ని పోలిన ఈ నా కుచకలశాల్లో మకరికాపత్రాల్ని చిత్రించు.

2. మన్మథబాణాలకు నివారకులైన కండ్లలో నీ అధర చుంబనంవల్ల తుమ్మెదల్లా ఉన్న కాటుకను ప్రకాశింపజేయి. నీవు ముద్దాడగా తొలగిన కాటుకను మళ్ళీ నా కండ్లలో ప్రకాశింపచేయి.

3. నేత్రాలనే లేళ్ళగంతుల ప్రకాశాన్ని అడ్డగిస్తున్న మన్మథుని పగ్గాలవలె అందంతో కూడి నా చెవుల్లో కుండలాలను తొడుగు.

4. అగ్రభాగంతో చాలసేపు సంచరిస్తున్న తుమ్మెదల్లా విలాసంతో కూడిన ముంగురులచే జయింపబడిన తామరలు గల నా ముఖమండలంలో చెదరిన అలకలను సరిచేయి.

5. క్రీడావిలాసంవల్ల ఏర్పడిన శ్రమవల్ల తోచిన స్వేద బిందువులు తొలగిపోయిన నా లలాట చంద్రబింబంమీద కస్తూరి బొట్టును చంద్రకళంకాన్ని జయించేటట్లు లిఖించు.

6. క్రీడలో దవిలియున్నప్పుడు మన్మథ ధ్వజానికి వింజామరల్లా జారిన నా కేశపాశంలో నెమలిపింఛాల్లా అందం గులికే పువ్వులను అలంకరించు.

7. బలిసి మన్మథుని ఏనుగు మెడలా ఒప్పుచున్న నా జఘనంలో రత్నాల మొలనూలు, వలువ, భూషణాలు అనే వీటిని అలంకరించు.

8. హరిచరణధ్యానమనే అమృతంచేత మునుపు చేసుకొన్న పాపాలన్నీ తొలగిపోగా శృంగార రసాలంకారంతో కూడిన ఈ గీతగోవిందమనే కావ్యాన్ని దయతో మనస్సును ఉంచి శ్రీకృష్ణా! అనుగ్రహించు.

గీతగోవిందం (అష్టపదులు) భావప్రకాశిక
సమాప్తము.

భారతి పవర్ ప్రెస్, గోపాలపురం, మద్రాసు - 600 086.